శ్రీమదాంధ్ర

# గీతగోవింద కావ్యము

శతావధాని, చల్లా పిచ్చయార్య రచితము

శ్రీ చింతపల్లి రాజ్ఞీమణి

శ్రీ రాజా వాసిరెడ్డి వేంకట లక్ష్మీనరసమాంబ బహద్దర్

మన్నెసుల్తాన్ గారి ధనసహాయముచే

ముద్రితము.

1950



Rs. 2-0-0

# విషయసూచిక

శ్రీ మత్పరదేవతాయనమః

# 'గీతగోవిందము'

అనుసీమహాకావ్యము భక్తమహాకవులలోఁ బ్రథమతాంబూల మందుకోఁ దగిన శ్రీ

"జయదేవ" మహాకవి

యక్షగానముగా రచించెను. ఇఁక నొక 'జయదేవ' కవి ప్రసన్నరాఘవ నాటకమును రచించెను. ఆయనకూడ సుప్రసిద్ధుఁడే. కాని 'గీతగోవింద' కావ్యము రచించిన కవినిగూర్చి యెక్కువగాఁ జెప్పకొందురు. ఈయనకు భక్తులలోఁ గల ప్రశస్తి నిరుపమానము. 'కృష్ణకర్ణామృత' కర్త 'లీలాశుకుఁడు'ను (బిల్వమంగళుఁడు) ఈయనయు "కృష్ణలీలాతరంగిణీ" కర్త "నారాయణతీర్థ"లును నొక తేజమేయని మూఁడుకాలముల యందు వేర్వేఱుగా నవతరించి శ్రీకృష్ణభగవానుని దమ కవితామృతముచేఁ దనియించి మూఁడవయవతారమున ముక్తిఁ జెందినట్లును పండితపరంపర కర్ణాకర్ణికగాఁ జెప్పకొనెను. లీలాశుకుఁడు బ్రహ్మచారియయ్యును జితేంద్రియుఁడు కాని హేతువునను, జయదేవుఁడు గృహస్థు అవుటచేతను ముక్తి ందనియట్లును "నారాయణతీర్థులు" యతి కనుక (సన్న్యస్య శ్రవణం కుర్యాత్) భగవానుఁడు ముక్తి ననుగ్రహించెననియుఁ ద్దలు చెప్పకొనఁగా వింటిని. జయదేవుని భార్యపేరు 'పద్మావతీ' దేవి. జయదేవుఁడు ఆయాగీతములను తన్మయుఁడై పాడు

నప్పుడు ఆసాధ్వీమణికూడఁ దన్మయురాలై నా
దనియు జెప్పఁగా వింటిని.

"పద్మావతీచరణచారణచక్రవర్తి"

అని యిమ్మహాకవి తనకు వాడికొన్న బిరుదనావ
ర్థింపఁబడియెడిని. ఆయీభక్తమహాకవి శ్లో॥ '
వరాశర' అనెడుభక్తులతోపాటు పూజింపఁ
యుఁడు ఈయనకును ఈయలఘునకుబోషకుఁ
రాజోత్తమునకును సంబంధించిన పుణ్యగాథలు
దిక్ప్రదర్శనమాత్రముచే గ్రంథవిస్తరభీతిచే విడుఁ
ఇట్టిమహనీయునిగేయములను తెలుఁగులో గేయ
మృదువైనభాషలో ననువదించిన చల్లా పిచ్చయ్య
అభినవజయదేవుఁడని మనయాంధ్రకవిశేఖరులు
రనినానిశ్చయము. గానమునకు సంస్కృతభాషక
భాషయే యెక్కువసౌష్టవము గలిగించు ననుట సర
మయినను "జయదేవ"కవి వాడినసంస్కృతము
కన్నను మిక్కిలిమృదువుగానున్నది. ఆం
ననువాదము నెడల గ్రంథకర్త గమనించినట్లు విజ్ఞు
గలరు.

కవిః కరోతి కావ్యాని । లాలయం త్యుత్త
తరుః ప్రసూతే పుష్పాణి । మరు ద్వహతి
వెం॥ శా॥ శతావధాని
కంఠీరవీంద్ర ఘటాపంచానన కల్యాప్రవృత్తే
బిరుదాంకితులు.

# శ్రీ జయదేవుడు-గీతగోవిందము

(శ్రీ) నిర్వికల్పానందస్వామి

క్రీస్తు శ. 1169 నుండి 1200 వఱకు వంగదేశమును పాలించిన (శ్రీ)లక్ష్మణసేనుని యాస్థానమున "ధోయి", 'ఉమాపతి ధరుఁడు', "గోవర్ధనుఁడు", "శరణుఁడు", "జయదేవుఁ"డను కవులయిదుగు రుండిరి. గోవర్ధనుఁ"డార్యాసప్తశతీ"రచయితగను, జయదేవుఁడు "గీతగోవింద"కర్తగను నేఁటికిని స్మరింపఁబడుచున్నారు.

జయదేవుఁడు జన్మించినది కేందుబిల్వమను గ్రామమున. ఇది 'వీరభూమ్'జిల్లాలో అజయూతీరమున నున్నది. నేఁటికిని ప్రతి మాఘమాసమున"జయదేవు"స్మృతి నుద్దేశించి యొకయుత్సవము జరుగుచున్నది.

## పద్మావతి

జయదేవుని తండ్రిపేరు "భోజదేవుఁడు", తల్లిపేరు రామాదేవి,భార్యపేరు రోహిణి పద్మావతియనురమణి. నృత్యమొనర్చునపుడు గతిననుసరించి తాళమువేయుదక్షత జయదేవున కుండెను. "గీతగోవిందము" పరాశరాదులగుమిత్రుల కర్పింపఁబడినది.

## దేవదాసి

"పద్మావతి" జయదేవునిభార్యయని 'సేక్ శుభోదయా' అనుగ్రంథము తెల్పుచున్నది. పద్మావతి జగన్నాథమందిర మందలి దేవదాసియని మఱికొందఱు.

## సంగీతబలము

ఒకప్పుడు 'వృూ్షమిశ్రుఁ'డను సంగీతవేత్త 'లక్ష్మణసేనుని' యాస్థానమునకు వచ్చి "పతమంజూరి" రాగమాలాపించి యచ్చట నున్న వృక్షపత్రముల రాల్చి యందఱకు విస్మయముఁ గూర్చెనఁట. 'పద్మావతి' గాంధారరాగ మాలాపించి నదీతరంగముల లేవఁదీసి యొడ్డున నున్న పడవలను నదీగర్భమున కీడ్చుకొనిపోయెననియు జయదేవుఁడు వసంతరాగ మాలాపించి పత్రశూన్యమైనవృక్షమును చిగుర్పఁజేసెననియును గథ.

## దేహిపదపల్లవముదారం

జయదేవుఁడొకప్పుడు దొంగలబారి బడ, వారు హస్తపాదములనుఖండించి, సర్వస్వమును గైకొనిరి. కాని దైవమహిమ వలన 'జయదేవుఁడు' మరల బూర్ణాంగత్వమునందెను. జయదేవుఁడు మరణించె నను మిథ్యావార్తను విని పద్మావతీదేవి వెంటనే ప్రాణములను వదలెనఁట. "దేహిపదపల్లవముదారం" అనువాక్యము వ్రాయుటకు సందేహించుచుండఁగా శ్రీకృష్ణుఁడే జయదేవునిరూపమును ధరించి జయదేవుఁడులేనిసమయమునందు తద్గృహముఁ బ్రవేశించి యావాక్యమును లిఖించిపోయెనఁట. ఇట్టివేయుగు పెక్కుకథలు జయదేవునిగూర్చి లభించుచున్నవి.

## పాశ్చాత్యవృత్తచ్ఛాయలు

కథకేమిగాని నాటనుండి నేఁటివఱకు "జయదేవుని గీతగోవింద" మాకర్షించినంతగా మఱియేగ్రంథమును భారత

దేశము నాకర్షింపఁజాలకపోయినది. గీతగోవిందపదము వినని గ్రామముగాని యాపదములతోఁ బ్రతిధ్వనితములు గాని విష్ణ్వాలయములుగాని భారతదేశమున లేనేలేవు.

ఈగ్రంథ మంతగాఁ బ్రచారితమగుటకు కారణము వృత్తచ్ఛాయలను జయదేవుఁ డనుసరించుటయే ముఖ్యకారణ మని పండితులు చెప్పుచున్నారు.

ఈగీతగోవిందకావ్యమునకు నింతవఱకు 38 వ్యాఖ్యలు సంస్కృతములో లభించుచున్నవి.

## అభిప్రాయములు

శ్రీ శ్రీ శ్రీ శతావధాని చల్లాపిచ్చయ్యశాస్త్రిగారిచే విరచితంబగు శ్రీ ఆంధ్ర"గీతగోవింద" మను కావ్యము స్థాలీపులాకన్యాయముననుసరించి యచ్చటచ్చటఁ జదువఁగలిగితిని. శిరోభ్రమవ్యాధిగ్రస్తుండ నగుటచే నామూలాగ్రంబుగాఁ జూడఁజాలనైతిని.

శ్రీ శాస్త్రిగారు జగమెఱిఁగిన బ్రాహ్మణోత్తములు. శాంతిదాంతిప్రధానశీలాగ్రగణ్యులు. ఆంధ్రగీర్వాణంబుల నారితేరిన బండితకవులు. విశేషించి శతావధానచాతురీధురీణులు. ఇట్టివారిచే విరచితంబగు 'గీతగోవింద' కావ్యానువాదమందలి కవితాప్రాశస్త్యమునుగూర్చి నాబోటియల్పజ్ఞుండు విమర్శించి గుణాతిశయములనుగూర్చి విమర్శింపఁదగినదికానేరదు. శ్రీ వారిరచన 'కవిబ్రహ్మతల్లజ' శ్రీజయదేవ రచితాష్టపదీగేయ కావ్యానువాదముగదా.

మూలమున భావమించు కేనియుఁ జెడకుండ శాస్త్రిగారు గ్రంథరచన మొనర్చిరనుటలో నతిశయోక్తిలేదు. శాస్త్రిగారి పదగుంభనాదులు మూలగ్రంథప్రాశస్త్యస్ఫోరకములయి విరాజిల్లుచున్నవి. గీతవిషయమున శ్రీ జయదేవాష్టపదు లెంత హృద్యములు, శ్రోత్రపేయములునునై రసికజనాకర్షకము లగుచున్నవో శ్రీ శాస్త్రిగారి యనువాదాష్టపదులుగూడ నట్లే శోభిల్లుచున్న వనఁదగును. మూలమున నున్న ప్రాశస్త్య ప్రావీణ్యాదులే తదనువాదమున వలసినంత సంక్రమించిన వనవచ్చును. మాగురుమిత్రులు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి మహోదయు లాంధ్రభాషాకవితయే గీర్వాణభాషాకవితకన్న మనోహరమని యీమధ్య 'భారతి' పత్రికలో వ్యాసమూలమునఁ దమయభిప్రాయము వెల్లడించిరి. కాని ఇతరత్ర శ్రీవారి యభిప్రాయము సరియగునేమోకాని శ్రీజయదేవాష్టపదులను గూర్చి మాత్ర మయ్యది సమంజసము కానేరదేమో యని నా సందేహము. కవిప్రకాండు లెవ రాంధ్రీకరించినను జయదేవుని సంస్కృతివాణి కుండెడి గీత్యానుకూలసామంజస్యము, సాహితీపేశలత్వము, కవితాచమత్కృతి లోనగు గుణవిశేషములు మూర్తీభవింపఁజేయఁజాలరేమో. అట్లైనను శ్రీశాస్త్రి చరణుల యేతదనువాద మన్నివిషయముల మూలమునకుఁ దీసిపోవునది కాదని చెప్పఁదగియున్నది.

శ్రీజయదేవునియష్టపదులకు 'ధాతుమాతు' ప్రయుక్తమగు గీతిపద్ధతి శ్రీ "త్యాగరాజాదులకీర్తనలకుఁబోలె గురుశిష్య సంప్రదాయసమ''నుగతముగా సంపాదితముగాలేదు.

దేశకాలపాత్రభేదములచే నయ్యవి యానోటనానోట నానా విధంబులుగా గీత మొనర్పఁబడుచున్నవి. దానంజేసి వాని మాతృక లెట్టివో యూహింప వీలులేకున్నవి. అవి తెలిసి నప్పుడుగాని మూలానువాదముల తారతమ్య మిట్టిదని నిరూపించుటకు వలనుపడదు. ఏది యెటులున్నను శ్రీజయదేవుని గీతగోవిందాష్టపదులవలె శ్రీశాస్త్రిగారి యాంధ్రాష్టపదులు కూడ సర్వదా గానమొనర్పఁదగిన వని నాయభిప్రాయము.

మచిలీపట్టణము
27—2—46

ఇట్లు
(సం.) హరి నాగభూషణము

ఓం

శ్రీరామో జయతి

"గాయకసార్వభౌమ"

పారుపల్లి రామకృష్ణయ్య పంతులు
బి. టి. యు. (భారతీతీర్థోపాధ్యాయులు)
ఎక్స్పర్టు కమిటిమెంబరు
మ్యూజిక్ ఎకాడిమీ, మద్రాసు
గవర్నరింగ్ బాడీమెంబరు
శ్రీ త్యాగబ్రహ్మ మహోత్సవసభ, తిరువయ్యారు

శతావధానులు, విద్వత్కవివర్యులు నగు బ్రహ్మశ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రులవారికి—

అయ్యా !

తమచే నాంధ్రీకరింపఁబడిన శ్రీజయదేవకృత 'గీత గోవింద' కావ్యము నామూలాగ్రముగఁ జదివితిని. మూలగ్రంథ మందలి నవరసభావాలంకారకల్పనలను రాగ తాళగమననియ మాదులఁ దప్పనీక వన్నె వెట్టురీతిని పద్యములను గేయములను అనువదించితిరి. అనితరసాధ్యమయిన యిట్టిమీసంగీతసాహిత్య కవిత్వ మెంతయుఁ గొనియాడఁదగియున్నది.

ఏతద్గ్రంథము కవులకు, పండితులకు మాత్రమే కాక గాయక, భక్తలోకమునకుగూడనత్యంత ముదావహము కాఁగల దని తెలుపుట కెంతయు సంతసమగుచున్నది.

ఇట్లు, విద్వజ్జనవిధేయుఁడు
పారుపల్లి రామకృష్ణయ్యపంతులు

బ్రహ్మశ్రీ ప్రతిభారవీత్యాదిబిరుదాంచిత భువనగిరి
శ్రీ ఉదయమయ్యశాస్త్రి, బి.ఏ., గుంటూరు.

## నవరత్నములు

క॥ శ్రీమచ్చల్లా పిచ్చయ
ధీమణి జయదేవకృతిని దెలిఁగించి రస
శ్రీమాధురి ప్రాకృతజన
సామాన్యవశం బొనర్చె సామర్థ్యమునన్॥

క॥ చల్లట! పిచ్చయ్యట!-కో
ల్లగఁ గమ్మని కవిత్వగోక్షీరఝురీ-

సల్లాపమధురసుధ వెద
జల్లెన్ బదపదమున న్బసందులు చిందన్॥

క॥ జిలిబిలి పలుకులు వెలగల
గొలుసులవలె మెలపుమెలికె తులుకఁ దలఁపుమే
ల్వెలుఁగుల చలువలు గెలలుగ
విలసిల నొలికించె నెంతవిజ్ఞత కలఁడో!॥

క॥ ఉనికి న్మతికి న్మనకున్
దనుకు న్దన కేమి రానినగుఁడుగ మాటా
నినచో నినుచు న్గునగున
రణితమణిత కావ్యగానరసమధురిమముల్॥

ఉ॥ అందపుమాట పొందున రసాకృతియా జయదేవు గీతగో
విందము విందొనర్చ్పదనిం దొడరం దెలుఁగుం బొనర్చ్పరీ
విం దొలివారినెల్ల మఱపించు టసాధ్యమ కాదె! వ్యూనిగె
ల్పొందె సుధీమనోజ్ఞసరసోక్తులఁబిచ్చయశాస్త్రి దక్షతన్॥

క॥ జయదేవుని పదరమ్యత
జయదేవునిదే యిగొంట సాధ్యముకా, ద
ట్లయినను జాతీయాంధ్ర
స్మయశయమగుఁ బిచ్చయార్య సత్కృతి నయమై॥

ఆ॥ అసలె శతవధాని యట! శతధాకావ్య
కల్పన న్ప్రసిద్ధిఁ గాంచెనంట!
అట్టివారి కెట్టియల్లిక యైన న
ల్లెఱుపైని బండి తీత కాదె॥

గీ॥ చల్లవాఁడట కవి లీల- చల్లవార
లేరి కోరినదట, నేత-యెల్లవారి
నల్లుకొని యేలు నల్లని చల్లవాఁడ
పెట్టిసింగారములకు నింకేమి కొదువ॥

ఉ॥ ధీరగభీర వాక్పటిమ దేవసరస్వతిఁ గొల్చి మేల్రసా
లారగసౌకుమార్య పదయుక్తిఁ దెలుంగుల మల్చినాఁడవం
చూజట నూఁజకుండక మహోజ్జ్వల నిర్మితిశక్తిఁ రక్తిస్వే
చ్ఛారతిఁ బిచ్చయార్యమణి!, సల్పు కృతుల్చిరజీవివైకళన్॥

శ్రీమదవధాని శిరోమణి మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు.
విజయవాడ. 20-6-1950

ఉ॥ శ్రీ జయదేవ వాగమృతసేవల మేల్రసపుష్టి నొంది క్రొం
జాజుల సొంపు నింపు వెదజల్లుచు నెంతయు నీదుపద్దెముల్
రాజిలు చుండు సర్వకవిరాజుల డెందము లందు సమ్మద
శ్రీజనియింపఁజేసి, కవిశేఖర పిచ్చయశాస్త్రి నిచ్చలున్॥

శ్రీమద్వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధాని, చిటివాడ
కృష్ణాజిల్లా 28-6-1950

అయ్యా! ఇపుడు తాము నాకుబంపిన శ్రీ సాంధ్ర గీతగోవిందమును చదివితిని. లోగడ కానిమోరా లైబ్రరిలో రెండు ప్రాచీన గీతగోవిందములను చదివియుంటిని. మీ

ఝా స్వేచ్ఛానువాదములో ధారాళత మొదలగు కొన్ని సుగుణములున్నవి. మీయనువాదము గూడ కొనలుసాగి ఆంధ్రదేశమంతయు నల్లుపెట్టుఁగాక.

మధ్వ శ్రీ కవిశేఖర పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు
సంస్కృతాధ్యాపకులు, హిందూకళాశాల,
గుంటూరు 1-7-1950

శా॥ శ్రీ చల్లాన్వయపిచ్చయార్యకవి వ్రాసెన్ గీతగోవిందముల్
శ్రీ చెన్నొందెడు శైలిఁ జింతపలి రాజ్ఞీదివ్యనామాంకమున్
వాచామాధురి శబ్దశుద్ధి రససంపద్భావనా వైదుషీ
ప్రాచుర్యంబులు మించు చొక్కటొకటిన్ భావంబు
రంజింపఁగన్।

**Sree T. S. Balasubrahmanya Ayyar M. A., L. T.**
*Inspector of Oriental Schools, Madras.*

---

**Sree Satavadhani Challa Pitchayya Sastry** **garu** gave me readings from his poetical Composiions. He is very good at Music. I heard im read Telugu rendering of Geeta Govindam nd some other works. He commands a very

fluent and easy style and added to his mellifluous voice, the recitation he gave was very excellent and entertaining. I have great pleasure in testifying to the high attainments of Sree Sastry at writing interesting poems.

— —

# శ్రీ సాంధ్రగీతగోవిందకావ్యపీఠిక

## శ్రీ ర స్తు

శ్రీ సంపూర్ణఝురీ-దరీమృదునద స్రోతోత్తుంగభద్రాంచితం
ప్రాగేకాదశభి ర్నగై రనభిదై స్సంసేవ్యమానం పురః
కుబ్జం భక్త మనువ్రజన్త మనుగై రారూఢగోష్ఠీవనం
శ్రీభూనాయక మన్వహం హృది భజే శ్రీభావనారాయణమ్॥

గీ॥ భవ్య శ్రీరామ భానుభూపాల పరిణ
యోత్సవ సదస్యమునఁ గృతియొసఁగ బడియె
సరసవిద్వత్కవీంద్రులు సంతసింప
భవ్య నరసాంబ మన్నసుల్తా నలరఁగ.

## —♦ కృతిప్రశంస ♦—

సీ॥ మానసోద్భవ సుకుమార సువర్ణశ
రీర, యుద్యానసంచార, ధీర
అభిమానధన, సువృత్తామాల్యభూషణ
భావసౌధాంతర ప్రకటచరణ
సాహితీధారణా సరసగీతివయస్య
సత్త్వగుణాంబర జ్ఞానముకుర
నవరసకల్పనా నవ్యప్రణాళిక
మత్తేభయానక్రమప్రచార
గీ॥ ధన్యురా లైనమత్కవితాకుమారి
రాజలక్షణ నొసఁగితి రాజ్ఞి వనుచు

మనసున గ్రహించి పెంచుము చనవుమెఱయ
సరసగుణాంబ వేంకటనరసమాంబ !

గీ॥ అష్టపదములగేయమ్ము లాంధ్రభాష
బృందజయదేవగోవిందుఁ జేర్కొనుటను
గీతగోవిందయను పేరు ఖ్యాతమయ్యె
నరసి యేల్కొనుమమ్మ ! శ్రీ నరసమాంబ !

గీ॥ ఇంటికోడలితోఁగూడ నేగుదెంచె
భారతీదేవి పచ్చని పందిటికిని
ఇరువురను నొక్కరీతిగా నరయుమమ్మ !
యత్తవారిల్లు పుట్టిల్లు నయ్యెనిద్ది.

—కృతిభర్తృవంశావళి—

శ్రీ చింతపల్లి సంస్థానము

సీ॥ శ్రీగజబృంహణ ప్రాగల్భ్య విలసిత
గజలక్ష్మికి నివాసకంజ మగుచు
పంచకల్యాణసం పల్లక్షణాంచిత
కుచ్చైశ్శ్రవ శ్రీకి నునికి యగుచు
పండితకవిగాత్ర పరివారవందిమా
గధముఖ్యులకు కనకాద్రి యగుచు
నప్రమేయాన్నపూర్ణామృత నిరతదా
నమునకు కల్పకనగము యగుచు

గీ॥ డాలు దీపించుకృష్ణాత టంబునందు
వఱలు సంస్థాన మిలఁ "జింతపల్లి యనఁగ

వన్న వాసియుఁ గాంచిన "వాసిరెడ్డి"
వంశజులు పాలకులుకాఁగ వారివరుస

క॥ దేవీభాగవతమ్మున
భావుకముగఁ జెప్పె "ముల్గు పాపయ" కవిరా
జా వేంకటాద్రివిభుప్రా
ద్భావిజగన్నాథ నృపతి తల్లజువలెకున్

క॥ శ్రీ వేంకటలక్ష్మీప
తిప్రవల్లభుఁ డాదిగాఁగ గ్రమముగ నిందున్
శ్రీ వాసిరెడ్డివంశ్యుల
భూవిభుల తరాలఁ బ్రకటముగ వివరింతున్

సీ॥ ధర్మప్రతాపమార్తాండుఁడై యెన్నియో
బిరుదముల్ సత్కృతుల్ పెరసినాఁడు
ఏకలగ్నంబున నెసఁగి శతాధిక
దేవప్రతిష్ఠఁ గీర్తిఁ గనినాఁడు
గురుతరసౌవర్ణ గోగర్భముం జొచ్చి
ద్విజకోటులకు కొల్ల పెట్టినాఁడు
ముమ్మాఱు కనకమ్ము మొనయించి రత్నాళి
తోఁ దులాభారమ్ము తూఁగినాఁడు

గీ। కీర్తికర్తకుబుద్ధి లక్ష్మికిని వడ్డి
పండితుల వేల్పుగిడ్డి యా "వాసిరెడ్డి"
వేంకటాద్రిప్రభూత్తము విక్రమార్కి
తాను "శ్రీ" రాజమన్నెసుల్తాన్ బహాదరు॥

సీ॥ గాంభీర్యమున నెల్లకడ లాక్రమించిన
కడలిరాయఁడు సాటి గాఁడటంచు
ధైర్యంబునను బ్రమథాధినాథుని చేతి
బంగారుకొండ యేపాటి యనుచు
శౌర్యంబునను గ్రీష్మచండప్రచండవి
కర్తనుండును నెన గాఁడటంచు
నౌదార్యమునఁ బాండవాగ్రజశిబిశాత
వాహనాదులు నెంత వారలనుచుఁ

గీ॥ జాటుచున్నాఁడు పవనుఁడు శబ్దముఖత
వేంకటాద్రి ప్రభుప్రతిష్ఠాంక వివిధ
దేవభవనధ్వజస్తంభ దివ్యదగ్ర
భాగవిలసితఘంటికా, ధ్వనిముఖమున॥

గీ॥ "మన్నెహంవీర బిరుదసం పన్న వేంక
టాద్రి కల్ప"ద్రుమము కొమ్మ లైచెలఁగిరి
వెట్టెమయుఁ బార్వతమ్మయు విరులు గుణము
లయ్యె సంతాన మనుఫల మందవేమి॥

గీ॥ వేంకటాద్రిప్రభుండు నుద్విగ్నమాన
సుండయి పితృవ్యులనుతుల "శూరచంద్ర
పాపయాఖ్యులకొమరులఁ వరుస దత్త
పుత్త్రిలుగఁ" జేకొనె న్వంశము ఫలమంద

గీ॥ "శ్రీ జగన్నాథగుణిమణి జ్యేష్ఠుఁడయ్యె
రామనా"థాభిధుం డవర జతకయ్యె



శ్రీ రాజా వాసిరెడ్డి వేంకట లక్ష్మీనరసింహానాయుడు,
మన్నెసుల్తాన్ బహద్దర్ గారు

వీరి నిరుపుర మూవురు విరివి పేర్మిఁ
గాంచుచుండిరి కన్నులకలవు దీఱ॥

గీ॥ న్యాయముగ వేంకటాద్రిభూ నాయకుండు
ధూర్వహత కల్గుదాఁకఁ దా నిర్వహించె
(శ్రీ) జగన్నాధబాబు తాజ్యేష్ఠుఁ డగుట
వంశకరుల పరంపర వఱలెఁ బిదప॥

సీ॥ వీరాతివీరుఁ డౌ వేంకటాద్రిక్షమా
నాధునకుఁ జగన్నాధనృపతి
దత్తకుమారుఁడై తగెను సర్కారు సం
స్థానాధిపతిఁ జేసి సత్కరించె
అభినవకాళిదాసాది చిహ్నము లొప్పు
పాపయారాధ్యాది ప్రధితసుకవు
లష్ట దిగ్గజములై యాస్థాని వెలయంగ
నగ్రహారములిచ్చి యమరనిలిపె
దేవసంస్థానములను భక్తిప్రపత్తి
ధర్మకర్తృత యొసఁగ నిత్యముగఁ బూర్వ
వాస్యకీర్తి ప్రతిష్ఠ లవ్వారిఁ జేసె
మన్నె హంవీరబిరుద సంపన్నుఁడగుచు

గీ॥ ఆ జగన్నాధనృపతి గుణాలయునకు
లలితలక్ష్మీపతి ప్రభాలయుఁడు దత్త
పుత్త్రుఁడై యొప్పె, ప్రజలను మోదమొదవ
ప్రజలమాదిరిగ నేలెను ప్రభువులలర॥

క॥ భూపాలకు లెల్లరు ల
క్ష్మీపతి నరనాథుఁ డల్ల (శ్రీ) పతియే మే
థాపుష్టిపటిష్ఠుఁడు గా
రీపతి సేవాఢ్యుఁ డనఁగఁ జెలఁగె యశశ్శ్రీ॥

క॥ ప్రతిసోమవారమును నియ
మితచిత్తుఁడు కవుల బుధుల మేళన మొనరిం
చి తగినరీతిని ఘనస
త్కృతులం బొనరించె విమలకీర్తి యెసంగన్॥

క॥ "(శ్రీ) లక్ష్మీపతి" నృపు వరి
పాలనమున కవలఁ బ్రజలఁ బరిపాలించెన్
భాలంకృత వేంకట ల
క్ష్మీ లలితగుణావలంబ కేవలయొకొర్తె॥

గీ॥ కంచిలో దివ్యభవనముల్ గడలుకొలిపెఁ
బ్రకటములు క్రొత్తకలల శిల్పములతోడ
దానఁ గల్యాణరత్న నిధాన ప్రజలఁ
గంచిదొరసాని యనెడు ప్రఖ్యాతి గాంచె॥

ఉ॥ వెంకలపాలికల్పకము, లేమలపాలిఁటిపూలదండ, న
ల్వంకల తప్పుదిద్దెడు కలాతతికిన్ రతనాలమేడ, రా
జాంకనివాసభూమి, గుణసారహాసన్ముఖసారసస్ఫుర
ద్వేంకటలక్ష్మమాంబ, కడువిశ్రుతిఁ గాంచెధరాతలమ్మునన్॥

ఉ॥ పల్లెలఁ బట్టణంబులను బాలురు వృద్ధులు నెల్లవారలున్
జల్లనఁ జేసి "కంచిదొరసాని" మముం గరుణార్ద్రదృష్టితోఁ



శ్రీ రాజా వాసిరెడ్డి వేంకట లక్ష్మీనరసమాంబ
మన్నెసుల్తాన్ బహద్దర్ గారు

దల్లికిఁ దల్లియై మనిచె దానము లెన్నియొ జేసెఁ గొల్లగాఁ
జల్లనితల్లియంచుఁ బ్రజ సంస్తుతిఁజేయును రేపుమాపులున్ ॥

గీ॥ అవలఁ దద్దత్తపుత్త్రిఁడై యడ్డులేని
స్వీయబుద్ధిబలంబునఁ జెన్నుమిగిలి
చెలఁగె "వేంకటలక్ష్మీనృసింహాన్నృపతి
బాల్యమునయంద పీరత పరగ". సంత॥

## శ్రీరాజా వేంకట లక్ష్మీనరసమాంబా పితృవంశము

గీ॥ ఇంబుదళుకొత్తఁ "గృష్ణాతటంబునందు
రత్నగర్భకు, గ్రామహారము" లయందు
ప్రథితిఁగాంచిన నాయక రత్నమగును
రమకు బంగరుటూయెల రావిరాల॥

క॥ తఱచయి యీ చకపికములు
పఱతెంచి యశంబు తేటపడఁ గీర్తింపన్
వఱలెడు నందున్ వాసిన్
"జిఱుమామిళ్ళ" న్వయంబు సిరులకు తావై॥

సీ॥ ఆవిమలాన్వయ మందున జనియించెఁ
జిత్తపద్మార్చిత శ్రీధరుండు
సత్త్వప్రధానుండు సహజసద్గుణరాశి
శ్రీరామనామ సుధీరథుండు
తత్పత్ను లైరి సుధామమీనాక్షమ్మయంబ
విశదభావాలంబ వెంకమాంబ

ప్రథమమునఁ బుత్త్రిలు వఱలిరి "భానుప్ర
సాద" ధీరుఁడు, భానుసదృశమూర్తి

గీ॥ "సూరయ గుణాబ్ధి వెంకయ," ధీరమూళి
మహితకోదండరామ సమాహ్వయుండు
గన్య 'వేంకటపతి,' యనఁ గల్పవంచ
కంబువలెఁ గంబుభృత్కృపాకారులగుచు॥

గీ॥ పుత్త్రియు జనించెఁ గల్యాణ భూరిబుద్ధి
లక్ష్మినరసాంబనా గుణాలంబి ప్రథిత
రాజలక్షణలక్షిత, రమ్యమూర్తి
ప్రజలు వేనోళ్ళఁ బొగడ సంపదలఁబొగడ॥

గీ॥ పెండ్లి పేరంటములు చేసి యిండ్లు నిలిపి
బీదసాదలఁ బాలించు విధము దెలుపు
నెలమి బాల్యంపుబొమ్మ పెండ్లిండ్లవలన
సరసద్గుణనికురుంబ నరసమాంబ॥

గీ॥ తద్గుణంబులు సుప్రసిద్ధంబులయిన
లక్షణంబుల నరసి ప్రతిక్షణంబు
నాఁటి యువరాజులందు నేమేటి పెండ్లి
కొడుకగునొ యంచుఁ దండ్రి నల్గడల నెమకి॥

క॥ బలియుఁడు లలితుఁడు ధీరుఁడు
సులక్షణాంచితుఁడు, ప్రథితశూరుం డగుచున్
దెలిసి యొసంగుటఁ దెలిపెన్
లలి వేంకటలక్ష్మినరస నరపాలునకున్॥



గ్రంధకర్త:
శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు – శతావధాని,
పొన్నూరు.

గీ॥ స్వీయపితృభక్తిఁ బ్రకటింప వేంకటాద్రి
విభుఁడు కూర్చిన జగ్గయ్యపేటయందు
చెలఁగె వెంకటలక్ష్మీనృసింహాలక్ష్మి
నరసమాంబావివాహఘనమ్ము మహిమ॥

క॥ పరిణయమై శ్రీలక్ష్మీ
నరసాంబిక పట్టమూని నరపతు లెన్నన్
పరిపాలన మొనరించెన్
ధర వేంకటలక్ష్మీనృహరిధరణీవిభుఁడున్

సీ॥ కాపట్యవారాశిఁ గడలుమా ర్తురపేరి
గండుమీలకు గుండెగాల మగుచుఁ
జనుదెంచు యాచకజనచాతకములకు
బ్రావృషేణ్యాంబు నీరదమ యగుచు
సాంపరాయాంగణ స్థానమ్ములందున
గంటు గాననివజ్రకవచ మగుచు
లావణ్య రూపవిలాస రేఖికలందు
మా ర్లనిమాఱటమారుఁ డగుచు

గీ॥ చాటవస్ఫుటవక్షఃక వాటుఁ డగుచుఁ
జెట్టపాలఁగ రాళనృసింహుఁ డగుచు
జెలఁగె వేంకలక్ష్మీనృసింహనృపతి
మన్నెసుల్తాన్ బహద్దరు హరొన్నకుదురు॥

చూడ న్లే రెటఁబళ్ళతో హరులు, బ్రముచ్చులొన నరారెందుమా
డన్ జంకనివారు లేరెచట, హాహాకారము ల్లేనెలే

వేశ్ వేంకటశ్రీనృసింహనరపాలేంద్రుండు పాలించుచోఁ
బైఁడిన్ వెండిని రత్నముల్ వితరణాభన్ వన్నె రెట్టించుచున్॥

పరిపూర్ణం బగు రాజ్యలక్ష్మి కగు సంపత్తిన్ విలోకింపఁగా
గురుదోర్దండయుగ ప్రచండ విసనాక్రూరాసి నృత్యక్రియా
సాంశన్ వేంకటశ్రీనృసింహపతిరాజన్మన్నె సుల్తాన్ బహా
ద్దరు మించెన్ సరివారు మెచ్చుకొనను త్తాద్యత్ప్రతాపాఖ్యుఁడై॥

గీ॥ పూవుఁదావియటుల్ వాని పోలిచి రెలిమి
నొండొరులు ప్రేమరస మెద నిండుకొనఁగ
ఇంద్రిభోగమ్ము లోలయ ధీచంద్రుఁ డలరఁ
జూపఱయును బ్రశంసింపఁ జొక్కు నెఱయ॥

శ్రోవల్ చూచుచుఁ జూడ్కితుమ్మెదలు చేతోజాతు డుప్పొంగ హృ
ద్యాభవాపూర్వసుమప్రతానములపై బాళై పరిమోదామృత
స్వావిర్భూతరసానుభూతులను నిత్యంబుం బ్రవర్తింప సం
భావింపం దగెఁ దత్పవిత్రమగు దాంపత్యం బపత్యార్థియై॥

గీ॥ కొంతకాలము చనునంత వింతగాను
కలిగె నెడబాటు దాన లోఁ గలఁక వొడమి
నడపె నొకకొంత తనప్రాణ నాథుకొఱకు
తగినయటు లక్ష్మినరసాంబ, ధర్మబింబ॥

కనుఁగో శ్రీనరసాంబ భూమి నిలుపం గంటంబు లాయాల్మగల్
కొనియాడంగఁ బరీక్షలో నిలిచి వాక్కున్ దృక్కు నేకంబుగా
ధన మెల్లయ్యెడు సాధనం బరయ నాత్మస్వామియే సర్వసా
ధనమా మేలనె మండలాధిపుల చెంతన్ భానుఁడే తోఁడుగన్॥

నానాఁట న్ననలూని తాలగఁత యానందంబుగా హృత్కుటీ
జానై యల్లఁగ నల్లిబిల్లిగను రాజ్ఞాంపత్య మొప్పొందెఁ ద
త్సూనాస్త్రుండనుజంద్రుడుం బవనుఁడున్దోరంబుపూయింపఁగ
మేనుల్ రెండుగభావమొక్కఁడుగఁగన్పింప ఫలాకాంక్షమై॥

క॥ ఆదట దాంపత్యము సు
(శ్రీ) దళుకొత్తించుతటిన చెలగించెను వే
త్రై దైవవిధి ననంతర
మా దేవియు రాజ్ఞియయ్యె నఖిలప్రజకున్॥

సీ॥ వలపుతో మెలపులు గొలుపఁగాఁ జాలుప
న్నీరు మున్నీరు కన్నీరు జేసి,
పరిమళించుచుఁ గంటఁ బడుపచ్చకప్రంపుఁ
గాటుక కటికచీఁకఁటిని జేసి,
యనురాగ మిటులుండునని చూపు కుంకుమ
కంట ముంజేరాపు గవియఁ జేసి,
పాలపొంగుల కలుపా యైనప్రాయమ్ము
వడి కానవెన్నెల పాలు జేసి,

గీ॥ పాలు సగమైన నామేను నేలఁ బెట్టి
నామనముమాత్రఁ గొనిపోవ నాయ మగునె
నాథ ! తనుకాంతిజితరతినాథ ! యనుచు
విరతమడలును వేంకటనరసమాంబ॥

గీ॥ రాజ్ఞియయ్యును నిట్టులు రాగబద్ధ
హృదయుఁ డగునాథుఁ డెడయుట నెద నడలుచు

సోదరాదరవచనభానూదయమున
ధైర్యమునఁ బాలన మొనర్చెఁ దల్లియట్లు॥

**-శ్రీ రాజా వేంకటలక్ష్మీనరసాంబా మన్నెసుల్తాన్ బహద్దరు-**

పదియాఱేడులయీడునాఁడె యొదవన్, బ్రాజ్యంబు రాజ్యంబు నే
ర్పొదవన్ దొల్లిఁటియప్పు దీర్చి సిరి పెంపొందించుచుం బుట్టుమె
ట్టుదివాణంబులు రెండు మెప్పుగొనునట్టుల్ మన్నెసుల్తాను శ్రీ
ప్రదలక్ష్మీనరసాంబ యొప్పెసఁగ దివ్యద్భవ్యనిర్వ్యాజయై॥

గీ॥ అత్తమేనత్తయునయి యలరు వెంక
టాభిధానమహాలక్ష్మి యాత్మ మెచ్చ
ప్రజలఁ బాలించె దైవతభక్తి వెలయ
నయము నయము నెఱింగి శ్రీనరసమాంబ।

జతనంబుం బొనరించి మార్తురెటులేసాధింప నెన్నెన్నొ చె
డ్డతలంపుల్ చెయువుల్పొనర్పఁ గడఁకన్ డాల్కొత్తి ధీశక్తి యే
కతఁ గైకోఁదగి యన్నిఁటన్ గెలిచె వీఁక 'న్వేంకటాద్రిప్రభు
ప్రతిభా శ్రీనరసాంబనాఁగఁ దనరెన్ రాట్ప్రీతి నుద్యత్ప్రభన్॥

మేదశ్శక్తి స్వతంత్రమంత్ర మొసఁగన్ మేల్ ధైర్యగాంభీర్యశౌ
ర్యౌదార్యంబులు తోడఁబుట్టులయి సాయంబుం బొనర్పంగ సు
శ్రీదైవారఁగ 'వేంటాద్రిప్రభు' కీర్తిస్ఫూర్తి రెట్టించు రా
జ్ఞీఁడామమ్మను లక్ష్మి యేలుతను 'లక్ష్మీనరసమాం' బాసతిన్॥

సత్యం బేకయివాలు నమ్మకమె నిస్తంద్రంబు సైన్యంబు ని
ష్ప్రత్యూహంబులు, కార్యసిద్ధులె పరీవారం బటు ల్పాలనా

ప్రత్యాసక్తియె తేరునై పరగ శేవర్ మన్నెసుల్తాన్ పద
స్తుత్య 'శ్రీనరసాంబ యేలెఁ బ్రజలన్' శూరు ల్బళీ ల్బాడఁగన్ ॥

గీ॥ వేయిరేకులతమ్మియాసనే! యటంచు
లక్ష్మి పరివారసహితయై లలి రహింప
'చింతపల్లి'ని నెలకొల్పెఁ జెన్నుకోట
'లక్ష్మినరసాంబమన్నెసుల్తాన్ బహాదరు'

గీ॥ ప్రాభవమున శరన్నవరాత్రులందు
నిలిపి మణిపీఠి దేవిని తెలివిదీవి
దంపతులఁ గొల్చును పురాణదంపతులుగ
'లక్ష్మినరసాంబ' నవసుమాలంకృతాంబ॥

సీ॥ సౌధాళితోపాటు స్థాపించెఁ గడల దే
వాలయంబులను ధర్మాలయములఁ
గోటలతోపాటు నాటించె నలుగడ
దిటవుగా నైజకీర్తిధ్వజములు
రత్నాలతోపాటు రహినిల్పె నమ్ముఁన
రమ్యంబు లౌగుణరత్నములను
బెండ్లిండ్లతోపాటు వెలయించె లలి బీద
వారియిండ్లను పచ్చతోరణములు

గీ॥ వన్నె వాసియుఁ గాంచిన "వాసిరెడ్డి"
వంశ్యుఁ డాణ్మన్నెసుల్తానుబహదరాది
బిరుద '(శ్రీ)లక్ష్మినరసాంబ' ప్రీణితాంబ
రాజలక్షణనికురంబ రహితదంభ॥

సీ॥ ఎంతయో యొసఁగియు నిది యెంతయని యర్థి
        కాదట సిడు పదాన్యత్యాగరిమ
తన సాటివారలు తర్జని ముకు సేర్పఁ
        బరిభవిల్లెడు ప్రాభవముప సహాయులు
త్రికరణంబులను బొందించి హృత్పీఠిని
        దేవిని నిల్పు భక్తిప్రపత్తి
వేదశాస్త్రాదిప్రవృద్ధికై పారశా
        లల నెలకొల్పు కల్యాణబుద్ధి

గీ॥ 'వాసిరెడ్డి'కొలం బనుపాలవెల్లిఁ
బంకువెన్నెలయై సుఖపాలనమునఁ
బరగు 'వేంకటనరసమాంబాబహాదను
రాజ్ఞి యందయొపంగును ప్రజలు' మెచ్చ॥

సీ॥ తనకీర్తివంటి తెల్లపతావిపూదండ
        లాదిగాఁగను 'వసంతా'గమమున
దనప్రాభవమ్ముచాయను చాయ లొసఁగెడు
        నాతపత్రాది 'గ్రీష్మా'గమమునఁ
దనహాయియటు మృదుత్వస్పర్శ కగుసాస్త
        రణతల్పముఖము 'వర్షా'గమమునఁ
దనసంపదున్నతదశ నెఱిగించెడు
        నఖిలవస్తులు "శరదా"గమమున

గీ॥ దాన మొసరించు 'మన్నెసుల్తాను లక్ష్మి
నరసమాంబిక కవిబుధాదరణశీల

నలుగడ యశఃపతాకలు నాటినట్టి
నాఁటిమన్నీలు మెచ్చుకో ల్ననిచి పొగడ॥

చిత్పరిపూర్ణ మహాహృదయసీమను నిశ్చలభక్తి రంజిలన్
ముత్పులకల్ జనింప నగుమోమునఁ జంద్రసహోదరత్వయా
వత్పరిపాటి పాటిలఁగఁ బ్రత్యహముల్ 'వరలక్ష్మిఁ' గొల్చు స
పత్పద 'రాజ్ఞి శ్రీనరసమాంబిక' ముత్తైదువందు నిల్కడన్॥

అక్షయ మైననిష్ఠ హృదయాంతరసీమను పుష్టిఁ గూర్ప నే
కక్షణమేనియున్ విడక కై జపమాలిక నాల్కదివ్య 'పం
చాక్షరి' నూర్పునట్లు లనిశంబును నీశున కప్పగించు స
త్యాక్షర "రాజ్ఞి శ్రీనరసమాం"బిక తద్విజ్ఞులు యోగులౌనన్॥

సీ॥ తనుఁ గొల్చుభక్తుల తలవాకిటను వీడ
క చరించునట్టిశంకరుఁ డటంచుఁ
గలలోకములఁ గ్రాఁచి కబళించు విషమును
కబళించి నట్టి శ్రీకంఠుఁ డనుచు
బంగారుకొండ చేఁబట్టి శ్రీ హిమవంతు
పట్టి కే ల్వట్టిన దిట్ట యనుచు
దురమున బలుమార్లు దుష్టుల కంఠంబు
లొత్తిన మృత్యుంజయుం డటంచు

గీ॥ దివ్యగోక్షీరముల మహాదేవు నిత్య
మును బ్రపత్తి మహాన్యాసపూర్వకముగ
వేదవేత్తలనభిషేకవిధులఁ దనుపు
లక్ష్మినరసాంబ లలితకలాకదంబ॥

కవచంబై కనుతెప్పయై హృదయసంకల్పంబు నిట్టూర్పునై
చెవి కట్లాత్మకు హాయిఁ గూర్చుచు సదాచేదోడు వాదోడునై
పవియై చెట్టులపాలఁ బాలనమునన్ 'భానుప్రసాద'ప్రభా
రవి తోడయ్యెను నర్సమాంబికకు సౌభ్రాత్రంబు పాత్రంబుగన్॥

సీ॥ వేదశాస్త్రాదిప్రవృద్ధికై తగునట్లు
వసతు లేర్పఱిచిన యసమకీర్తి
అన్నపూర్ణావిశాలాక్షీసమారాధ
న మొనర్చు నట్టిఘనాశయుండు
కేవలరాజ్యాంగభావంబులన కాక
యాత్మ శోధించిన యట్టియోగి
దేవతాభూదేవతావిసరమ్మున
భక్తిప్రపత్తుల పట్టుగొమ్మ

గీ॥ అప్రతర్క్యప్రతాపభానుప్రసాద
మహితగుణరత్నవారాశిమందిరంబు
రీతి హాయిఘటింప నిరీతి నేలెఁ
బ్రజల శ్రీమతినరసాంబ పార్థితాంబ॥

సీ॥ "క్రౌంచాద్రికలితామరావతీనగరాంత
రేశిత్వ 'రా'మలింగేశు" ప్రోల
"గుంటూరుపురి"జయఘంటికాడంకృతి
ప్రథఁ గన్న వేణుగోపాలు నెదుర
కలుషమదేభాళికంఠలుంఠనచణ
"వైకుంఠపురి" శ్రీనివాసు పజ్జ

హరిహరాభేదత్వ మెఱింగించు "పొన్నూరి
భావనారాయణస్వామి చెంత

గీ॥ నిలిచి నిత్యోత్సవాదుల నెఱపి తత్త్వ
మెఱిఁగి బీదలసాదల నెలయుదయను
మనిచె భానుప్రసాదసమ్యగ్గుణుండు
లక్ష్మినరసాంబమన్నెసుల్తానుతోడు॥

భానుప్రసాద మన్నఁ గనువారలకే లభియించు ధాత్రిలోఁ గాన నివాని కింతయును గల్గక యుండుట నిక్కువంబ యీ భానుప్రసాదమన్నఁ గనువారును గన్నులులేనివారలున్ నూనమె కాంచఁజాలిరన నూత్నముగా మఱి చెప్పనేటికిన్॥

క॥ భోగమునాఁడే యోగముఁ
ద్యాగము వెలయంగ దేవతాపటుభక్తి
శ్రీఁ గని భానుప్రసాదముఁ
దాఁ గని భానుప్రసాదధన్యుం డొప్పెన్॥

గీ॥ చెప్పుకొందురు సతము గోష్ఠీవనమునఁ
బ్రజలు భానుప్రసాదదివ్యద్గుణాఢ్యుఁ
బోలు పురుషోత్తమునిఁ గనఁబోము నిజము
ధర్మమూర్తి దయాశాలి, దక్షుఁ డనుచు॥

శ్రీరాజా వెంకటలక్ష్మినరసాంబా మన్నెసుల్తాన్ బహద్దరు

## — మ నో వి చా ర ణ —

సీ॥ తూలించితినిగదా తూలసంహతుల వా
తూలమ్మురీతి శత్రుత్కరముల

గాలించితినిగదా కాటించునప్పుల
రాజ్యలక్ష్మి మనోరంజనముగ
తోలించితినిగదా తోరమ్ముగాధన
రాశులు నర్థివివేశములకు
పాలించితినిగదా ప్రజలబాధింపక
కడుపులో నీ రింతకదలకుండ

గీ॥ ఎన్ని చేసిన వ్రేల్వెట్టి యిదిగో యనుచు
నేమిచేయుచునుండిన నెచటనున్న
పుత్రిసంతానలోపంబు పొడవుసూపె
నని విచారించె నరసాంబ యర్భితాంబ॥

## పుత్రిసంతతి ప్రశంస

చిఱుమామిళ్ళవసంతవేళ యనఁగాఁ జెన్నొంది శ్రీవాసిరె
డ్డింమాజ్యోత్స్నకు శారదప్రభయనన్ శీర్విన్ యశస్ఫూర్తిమై
పరగంజాలియు వంశహార్తికము దృక్పర్వంబు మేల్పట్టి సం
బర మెన్నండు లభించునంచు నరసాంబారాజ్ఞి యెంచెన్మదిన్॥

సీ॥ గురుభోగభరపురం దరపురారరభిదా
త్వరమూణకుంచికాధార కుజ్జ
అభమచ్చుభాభ్రభ విభ్రమాదభ్రకీ
ర్తిలతానికుంజప్రవృద్ధి ప్రాప
గాఢమోహాధ్వాంతకశ్మలాయితహృదం
భోజసూర్యప్రభాస్ఫూర్తి పట్టి

చక్షుశ్చకోరతృష్ణావారితరణరా
కాసుధాకరబింబఘనత చిఱుత

గీ॥ యనుచుఁ బ్రాణమ్ము ప్రాణమ్ము లయినవారి
తోడఁ బలుమఱుఁ బలుకుచుఁ దొట్రుపోదవ
లక్ష్మినరసాంబమన్నె సుల్తాన్ బహాదరు
వందురుచు నుండె నందనప్రాప్తిపొంకై॥

భవనాంతశ్చరరత్నదీపము కలావైశద్య మానంద మూ
ర్తివిభుత్వప్రకటావలంబనముఁ దృప్తిస్ఫూర్తి యాదర్శబిం
బవిశేషంబు ముఖస్థకల్పకము దృక్పర్వంబుకర్పూర మీ
భువి సత్పుత్త్రుఁ డటంచు శ్రీనరసమాపూర్వాజ్ఞ భావించెఁగో॥

మఱియున్ వచ్చియు రానివల్కు తలపై మచ్చంపుఁ"బింపిళ్ళు తా
మరపూరేకుల తీరు నేరుకనులున్ మాటాట పాటాట" చూ
పఱఁ దన్పంగలముద్దుబాలకుల కేకల్ ధాత్రిఁ బుణ్యాత్ములే
యరయంజాలుదు రంచు నెంచె 'నరసాంబా' రాజ్ఞి తా నెమ్మదిన్॥

సీ॥ నిండుపున్నమనాఁటి నెలఁ బోలుమోముల
పసిపాప లెదురఁ గన్పడినయపుడు
గునగున నేనుంగుగున్నలవలె బిడ్డ
లెత్తి తలల్పరువెత్తునపుడు
చిగురుమామిడిక్రింది చిన్నకోయిలలట్లు
పరగి బాలకు లాచి పాడునపుడు
పింపిళ్లు తుమ్మెదగుంపట్లు రాణింప
జిఱుతలు గుంపుగాఁ జేరునపుడు

సీ॥ ఉస్సురనుచు వేఁడినిట్టూరుపు పుచ్చ
గొలువుకూటంబుఁ బొరఁగనుంగొనుచునుండ
తనకు పుత్రోదయము లేమిఁ దలఁచి తలఁచి
'లక్ష్మీనరసాంబ' గుణిగణాలంకృతాంబ।

సీ॥ ప్రాసాదకుడ్య చిత్రముల యశోదాంక
పాళి శ్రీకృష్ణుని లీలఁ గాంచి
విద్వత్కవులు గోష్ఠి వినుచు గ్రంథంబుల
బాలబాలోత్కర్ష మాలకించి
యంభారవమ్ముల నబ్బులు నాకుచుఁ
బొదుగు పాల్గోరిలు క్రేఁపులను జూచి
పూఁదోఁట మ్రాఁకులఁ బోఁతుఁ బెంటియు నెఱ
పిల్లల కందించు విధము నరసి

సీ॥ విశ్వమున కంతటికిని దృష్టిఁ ఘటింపఁ
జాలునది యొక్కకానుపే చాలదన్య
మనుచు నిశ్చయమొనరించు నాత్మయందు
'లక్ష్మీనరసాంబ' లక్షణలక్షితాంబ॥

అయినతరాల నాలుగిఁట నాఁగెను తత్తనయోదయంబు వి
స్మయముగ నేమికారణమొమాయురెయంచునుభావదేవునిన్
దమ దయివాడు వానిని నెదం దలపోయుచు దత్తపుత్రుకై
రయమునఁ దేరఁగాఁ బనిచె "రాజ్ఞి" సగోత్రకుమారకోటులన్॥

వచ్చినజాతకావళులఁ బండితకోటికిఁ జూపుచున్ గుణా
భ్యుచ్ఛ్రయమేదియో యనుచునొక్కటియొక్కటి వేఱు వేఱుగా

నొచ్చములేని ప్రేముడిని నోజ నెఱుంగుచు రాజ్ఞి యాత్మజుల్
వచ్చిన దిందొళంబునను గనంబడకుండె నటంచు వందురే॥

గుట్టలు గుట్టలై యలముగోరము లోర్చి రమేశుపుత్త్రుపట్
నెట్టన రాజ్యభార మది నెక్కొని బాహువుఁ జేసుటాదిగాఁ
బట్టినదెల్ల బంగరుగ వన్నెయువాసియుఁ గాంచినందు కి
ప్పట్టున నర్హుఁడౌ శోమసుఁ బట్టిలభింపఁ డటంచు వందురే॥

ఇటు కాలం బొకకొంత వో హరిహరాహినానుకంపాప్తిమై
స్ఫుటసల్లక్షణలక్ష్మి తాంశములతోఁ జూపట్టె: గన్పండువో
క్కటి పైఁబూనిక వాసిరెడ్డిశశిముక్తాచంద్రపహాళీశుఁ డు
త్కటమహాసాయ మొనర్ప రాజ్ఞి సలిపె: దత్తోత్సవోత్సాహముల్

గీ॥ అర్థిదారిద్ర్యమును శరణార్థిభయము
ముక్తముగఁ జేయుప్రభువులఁ బ్రోచుచుండు
శివుఁడు ముక్తీశ్వరుం డుంటఁ జెలఁగె భువిని
ప్రథిత 'ముక్త్యాల' యనుపేరు ప్రజలు మెచ్చ॥

సీ॥ ముత్యాలవలె వర్ణములు గూర్చువ్రాయస
కాండ్రకు నెల వగుకారణమున
బీదసాదలఁ జేరఁబిల్చి పెండ్లికి తలఁ
బ్రాలు ముత్యా లిడు ప్రాశ్నికతన
శరదుత్సవముల నీశ్వరిని ముత్యాలప
ల్లకి నిల్పి గొల్చు సల్లలితభక్తి
శతసహస్రములుగా సాధనిర్మితులకు
ముత్యముల్ పవడముల్ నిత్య మిడుట

గీ॥ పేరురంబున ముత్యాలపేరు లగుట
తనరె సంస్థానమునకు ముత్యాల యనియు
నెసఁగు నాథుండు చంద్రమౌళీశ్వరుండు
సలిపె దత్తోత్సవము విఘ్నములఁ దొలంచి॥

గీ॥ "చంద్రమౌళీశ్వరుఁడు" ప్రోచుఁ "జంద్రమౌళి"
ధరణిధవుసుతు వంశముక్తాఫలంబు
నేలు "(శ్రీ)రామ"గోపాల్ మహేశ్వరప్రి
సాదుబహాదరు ముక్తియోషావిభుండు

ఆదత్తోత్సవవేదిపీఠికలఁ దాఁ బ్రాపై "పద్మనాభా"ఖ్యరా
మోదారాశయుఁడన్నపూర్ణయెన కానొప్పైన పూర్ణాంబయున్
శ్రీ దత్తోత్త నలంకరించిరి మహా శ్రీ"వేంకటాద్రిప్రభు
ప్రాదుర్భూతయశోలతావితతి పుష్పశ్రీ గుబాళింపఁగన్

సీ॥ నగరునం దెల్లెడ నిగనిగతోఁ గ్రొత్త
కన్పట్టె రహి నలంకారలక్ష్మి
సందుసభాస్థాని నెమ్మోమునందున
జాలొత్తె వివిధయాశబ్దలక్ష్మి
పరివారబాంధవప్రజల నాశ్రితులను
సంపూర్ణయయ్యె నుత్సాహలక్ష్మి
ఘంటాపథంబుల గవనివాకిళ్లను
కడునొప్పెఁ గరితురగాదిలక్ష్మి

గీ॥ తనరి యట్టులు ధనలక్ష్మి ధాన్యలక్ష్మి
యెల్లలక్ష్ములు నొకయెడ నెసకమెసఁగె

"లక్ష్మీనరసాంబమన్నె సుల్తాన్ బహాదరు"
దత్తపుత్త్రోత్సవమహాభ్యుదయమునందు"

గీ॥ అంత దత్తత చెల్లదటంచుఁ బ్రబల
యత్నములు చేయఁబడియె నత్యద్భుతముగ
నైన సర్వేశుకృప "మండలాధిపతులు"
చెల్లఁజేసిరి యధికారచిహ్న మొసఁగి॥

పేరిమి నింతకున్మును పెంచుచునుండెను మేనకోడలిన్
నేరుపుదీవి నిర్మలత నిల్వ జగానిగరత్నదీప్తి మే
ల్మీఁరిమిపూవుఁదీవె యనుకోమల గోముగఁ 'బార్వతీ'సమా
ఖ్యారమణీయ కోడ లగుఁగావుత మంచని'రాజ్ఞి' యెంచుచున్

క॥ అంతటఁ గొంతచనం దటి
సంతసమున హరిహరప్రసాదకుమారా
నంతాపతిపరిణయ మ
త్యంతమనోహరవసంత మన నొప్పెసఁగెన్॥

"హరిహరసుప్రసాద" సుకలాకర శ్రీరమతీయుపార్వతీ
పరిణయ మొప్పెఁ జూపఱకుఁబండువుగా మదివేడ్కనిండుగా
'నరసమరాజ్ఞి'మానసము నర్మిలి తావిని మేఁటితేఁటగా
సరసవసంతవాసరము చాయను చాయల పెండ్లిపందిఁటన్॥

సీ॥ విరివియై మురువునై పరగు నొఁడారులయె
డంద పాదులపొందు నందగించి
కెంపువన్నియ రేక కెరలి క్రొంజిగి మించి
చెలఁగు కెమ్మోవుల చిగురుదొడిగి

సెలవులఁ ద్రోవలు వెలయించుకొని డాయు
చిఱునవ్వు పేర రంజిల్లిప్పూఁచి
చేరెడుకందోయిఁ దోరంబుగా సాగు
చూడ్కి తుమ్మెదలకు చొక్కుఁగూర్చి

గీ॥ భోగములపాలవెల్లి యా రాగపల్లి
యిట్లు మధుమాసవల్లరి యట్లు మెఱయ
"హరిహరప్రసాదపార్వతీ"తరుణయుగళ
లలితశృంగారకలనావిలాస మొసఁగె॥

సీ॥ ధీలతాకుంజంబు తెలిపూలతావుల
కవితాకుమారి శృంగార మొసఁగె
రాగమ్ము పల్లవి రమణీయతం జూప
గాయకకోకిలగాన మొప్పె
తంబురావీణమొద ల్మనోహరవాద్య
రవములు తుమ్మెదఱవళి యయ్యె
నమృతమ్ము కంటె నాప్యాయనత్వముఁ గూర్చు
చలరేఁ బానీయరసాయనములు

గీ॥ ఇద్దియే యననేల పంచేంద్రియముల
రాణ చెన్నొందె "శ్రీకుమార" విభుపెండ్లి
పండువున "నర్సమాంబ కన్పండువ" య్యెఁ
గనులు కలవారలెల్లరు గాంచి రెలమి॥

సీ॥ అనురాగరూపంబు లగు 'ప్రవాళంబులు'
ప్రాభవంబును దెల్పువజ్రవితతి

మెలఁగు శ్రీఁ గొలువు 'గోమేధిక' వ్రాతమ్ము
తోరణ ల్గూర్చు "వైదూర్య" వితతి
గారవాకృతులు 'ముక్తాఫలో' త్కరములు
రక్తిఁ దెల్పెడు "పుష్యరాగ" సమితి
మారుతేజీరు 'మరకత' విసరంబు
నీరంధ్రరుచు 'లింద్రనీలమణులు'

గీ॥ శ్రీకుమారేంద్రు పట్టాభిషేక వేళఁ
గనులు శృంగార 'నవరత్న' కళలఁ గాంచె
'వేంకటాద్రి' నృపాస్థాన వేది 'ముల్లు
పాపయారాధ్య' ముఖకవివంక్తియట్లు॥

సీ॥ శ్రీ రహియింప సీతారామచంద్రుని
నెటి గన్న యేకపత్నీవ్రతుండు
గతయుగత్రయనృపాగ్రణులను దలపించు
నమలిననిత్యసత్యవ్రతుండు
ఆబాలగోపాల మాత్మీయులుగఁ జూచు
ప్రథితిఁ గాంచిన ప్రజాపక్షవర్తి
తేజోవిశేషంబ రాజలక్షణలక్ష్మి
తం బయ్యెనను నిరాడంబరుండు

గీ॥ శాంతినిధి భక్తినెలవు విశాలబుద్ధి
సరససంగీతసాహిత్య సారవేది
ప్రజలభాగ్యంబగు 'హరిహరప్రసాద'
మన్నసుల్తాన్ బహద్దరు మాలిమేదురు॥

గీ॥ సద్గుణంబుల ప్రోపు విశాలహృదయ
దయకుపుట్టిల్లు స్ఫురితవిస్తారశోభ
భవ్యపతిదేవతామణి 'పార్వతీ'స
మాఖ్య తత్పత్ని రాజచిహ్నప్రశస్త॥

సీ॥ మెప్పునకై నోరువిప్పి చెప్పుటకాద
యాడినమాట శిలాక్షరంబు
రాజుగారనుచుఁ బేరాసఁ బల్కుటకాద
మాలిమిఁ జూపుచుట్టాలసురభి
గట్టిపట్టునుబట్టి కథియించుటలుకాద
శ్రితజనావళులకు జీవగఱ్ఱ
పరిచితుండని నొక్కి వాక్రుచ్చుటలుకాద
చెవి యొగ్గువారికి సిరికొటారు

గీ॥ అమరు రాడ్యాసిరెడ్డికులాబ్ధివిధుడు
హరిహరప్రసాదపాత్రుఁ డాదరణమూర్తి
"హరిహరప్రసాదనామాంకితావనీప
లలితరత్నంబు మన్నెసుల్తాన్ బహదరు"

క॥ ఆరాజదంపతులకు కు
మారులు జనియించి రమలమధురాకారుల్
ధీరు లుదారులు విహితా
చారులు నిజవంశజలధిశారదచంద్రుల్॥

వారల యద్దుముద్దులను వారక చూచుచు నాతరంబె యీ
యారసపుత్త్రిసంతతి ముదంబుధివీచుల నూఁగుచుండె నా



శ్రీ రాజా వాసిరెడ్డి వేంకట హరిహరప్రసాద్ బహద్దర్,
మన్నెసుల్తాన్, జమీందారుగారు
చింతపల్లి

శ్రీరమ నెన్నఁగాఁ దరమె చెందితిధన్యత ధాత్రిలోన నా
కేరి సమాన లంచు మది నెంచును శ్రీ 'నరసాంబ' నిత్యముల్॥

సీ॥ కంకణమూని మోక్షమొసంగు 'కాశిక'
కల్యాణమయరత్నఖని "యయోధ్య"
మలయుపాపంబుల మాయింపఁజాల్మాయ
మహనీయమహిమసం పన్నమధుర'
ప్రకటితోద్ఘాటిత స్వర్ద్వార 'ద్వారక'
బంధమోచన సేతుబంధనంబు
భక్తసంత్రాణదివ్యాంతి 'యవంతిక'
యంచితకామాక్షి కాంచి కాంచి

గీ॥ మున్నుగాఁ గలతీర్థముల్ మొనసి చూచెఁ
దాను సకుటుంబయై ధన్యతం దలంచి
కొమరుఁ గొమరుండుఁ గోడలు నమరికొలువఁ
గవులు విద్వాంసులును గోష్ఠి గడలుగొలుప॥

## —◆ దినచర్య ◆—

సీ॥ ధర్మాధికారసంస్థానమ్ములందుండి
యేతెంచుశుభవార్త లెలమిఁ గొలుప
జిన్నారిపొన్నారి జిలిబిలిపలుకులఁ
బౌత్త్రిలానందసంవర్తిఁ గూర్ప
గుణనిధుల్ కొమరుండు కోడలు కనులకు
కర్పూరమటు హాయిఁ గడలుకొలుప

బద్ధాంజలులఁ దనపజ్జఁ గన్నన్నన
పరివార మొప్పగఁ బను లొనర్ప

గీ॥ సిరులు తామరతంపరవరుసఁ బెరయ
వేదశాస్త్రప్రవర్ధనవృత్తి వెలయ
ధన్యురాల నటంచు సదాతలంచు
'లక్ష్మినరసాంబమన్నెసుల్తాన్ బహదరు"॥

సీ॥ వఱువాత మేల్కాని హరిని మనఃపీఠి
నిలిపి ధ్యానింతురు నిష్ఠ వెలయ
నాడటఁ గాల్యకృత్యంబులు పొనరించి
పూజింతు రిల్వేలుపులను భక్తి
నట స్వీయదేవాలయస్థానవార్తలఁ
జెవిఁజేర్చుచుందురు చెలఁగు వేడ్క
మీదటఁ దీర్ఘప్రసాదముల్ చేకొని
యారగింత్రతిథిసత్కార మెసఁగ

గీ॥ సతము ధర్మవిచారణ సలుపుచుంద్రు
హావణుగఁ బురాణగోష్ఠి సంధ్యయగుదాఁక
విద్వదవతంసముఖమున వినుచునుంద్రు
తల్లి కొమరుండు మన్నెసుల్తానుబహాదరు॥

భక్తిమఱింగి వక్త్రముఖపద్మవినిర్గతభావబోధనా
శక్తి నెఱింగి ధర్మనయసారవిశేషకథాంశసంభవ
ద్రక్తిగరంగి నిత్యమును రాణిఁబురాణము లాలకింత్రు సం
త్యక్తదృగంతరాయులు "బహద్దరులిద్దఱు" మాతృపుత్త్రికుల్॥

సీ॥ పుత్త్రుఁడు పచ్చకర్పూరమ్ము తల్లికి
తల్లి నీరాజన తనయునకును
సూనుండు దీవన యొసఁగు సవిత్రికి
రాజాజ్ఞ యంబ తనూజునకును
జననికి పుష్పవర్షంబగుఁ గొమరుండు
మాత సూర్యాభ కుమారునకును
ఆమకు నందనుండు నిత్యామోదమాల్యంబు
పాత్యగంధం బాత్మభవున కంబ

గీ॥ హరిహరప్రసాద్ బహద్దరు నరసమాంబ
మన్నెసుల్తాన్ బహద్దరు మాతృభక్తి
పుత్త్రివాత్సల్యముల సదా ప్రేమలనుండి
యరయువారలకే తెలియంగనగును

## —♦ సంస్కృత కలాశాల ♦—

సీ॥ వ్యాకరణాది సమస్తశాస్త్రంబులు
సంస్కృతవాఙ్మయ సాహితియును
ఆంధ్రవాఙ్మయరహస్యప్రబోధమ్మును
సంగీత ముభయభాషాకవితయు
గణితము హిందియాంగ్లమ్మును మొదలైన
దేశభాషలు కలల్ తేటపఱుపఁ
జాలి వేదాంగాది సర్వరహస్యముల్
ప్రకటింపఁ జాలిన గ్రంథశాల

గీ॥ వృద్ధిగాఁగాదు మృతభాష యెంచి చూడ
సమృతభాషయు సంస్కృతమనుచుఁ దెలుపు
సంస్కృతకలాలయమ్ము శాశ్వతమునిలిపె
హరిహరప్రసాదవిభుఁడువి ద్యావిదుండు

గీ॥ ఉర్వి(ఁబ్రథఁగన్న యట్టి పౌన్నూరునందు
తత్కలాశాల కంగముల్ తగి ఘటించె
దూరవిద్యార్థులకు వసతులు సతంబు
హరిహరప్రసాద విభుఁడు విద్యావిదుండు

సీ॥ తనపుట్టినింటను దినదినమ్మును బుట్టు
రకరకమ్ముల మేలిరతనములను
తనకూర్చునన్న యింటను సదా జాల్వాఱు
నజరదశాధార యమృతధార
తనమేన జంటఁ బాయని ప్రాణనాథుని
యఖిలపాలనవిభవానుభవము
తన మేలికడగంట ననయమ్ము వెడలెడు
సకలసత్పదలను సంపదలను

గీ॥ పరిమళముపంట తనయింటఁ బరగుకళల
నన్వహము గూర్చుఁగాంతఁ బేరందుదంట
హరిహరప్రసాదభూపాలవరునియింట
రాజలక్ష్మి విశాలాక్షి రత్నకుక్షి॥

సీ॥ పద్మాంకము "శ్రీరామభానుభూపాలకు
మారుఁ బద్మాంకుండు మనుచుఁగాంత

'రామలింగేశ్వర' ప్రాభవ 'వేంకట
లక్ష్మీనృసింహ' కలానిధాను
తిరుపతి వేంకటేశ్వరుఁడు రక్షించుత
విజయభూపకుమారు విజయుఁ డేలు
బాలశంకరుఁడు కృపాలుఁ డేలుత 'బాల
శంకరు స్వప్రసాదాంకుఁ గోమకు

గీ॥ "వాసిరెడ్డ్యన్వయుంబు నవ్వారిగాఁగ
పుత్త్రపౌత్త్రాదిసద్రత్న పుంజగుచ్ఛ
భాసురం బొనరించుతఁ బాయ కెపుడు
రాజ్యలక్ష్మియు భావనారాయణుండు॥

క॥ శ్రీలలితకీర్తిఁ బూయఁగ
బాలించిన వేంకటాద్రిప్రభు ప్రాభవముల్
బాలించు మన్నెసుల్తాన్
శ్రీలక్ష్మీనరసమాంబ శ్రీపతి యేలున్

క॥ అమరావతీపురిం గల
యమరేశ్వరు లయినహరిహరాధీశ్వరు లు
త్తమ వాసిరెడ్డివంశ్యుల
నమితకృపామృతముగురియ నగుదురుగాఁతన్॥

ప్రప్రథమదర్శనమున శ్రీరాజా వాసిరెడ్డి హరిహర ప్రసాదబహద్దరు మన్నెసుల్తాన్ జమీందారుగారినిగూర్చి కవి వ్రాసిన యుత్పలమాలిక.

శ్రీకర 'వాసిరెడ్డి' కులసింధుసుధాకర ! సంపదుల్లస
త్ప్రాకటవైభవా ! హరిహరస్ఫుటదివ్యమహాప్రసాద ! ల
క్ష్మీకరనామధేయ ! వినుమీ ! మును పద్మభవుండు సృష్టిలోఁ
గోకిల చైత్రమాసములకున్ ఘనచాతకపంక్తికిన్ సరో
జాకరరాజహంసముల కంబుజమిత్రుల కెట్లొనర్చెనో
యాకరణి న్మహాకవుల కాధరణీశులకుం బరస్పరా
స్తోకసమగ్రమైత్రి మెలఁజుట్టెను పీడకయుండఁ గావునన్
మీకును మాకు సంతతము మేళనెఁ బోషకపోష్యభావ మా
ద్యాకృతిసంస్కృతమ్ము రసమంతటనించెను విక్రమార్కుఁసు
శ్లోకుఁడు భోజరుద్రకవిసూరులు నట్టులె యాంధ్రసూక్తికిన్
ప్రా కిడి రోపి చోడపతి రాయలు శ్రీరఘునాథముఖ్యులో
పై కడలందుఁ గీర్తి దయివారఁగఁ జేసినధర్మమూర్తి మే
ధాకలితుండు భక్తిఁ దలిదండ్రులపేరను పేటలం గలా
శ్రీకములం బొనర్చినప్రసిద్ధుఁడు పాపయముఖ్యసత్కవి
ద్యోకటగాంగనిర్ఝరరసోక్తినిమగ్నుఁడు యుష్మదీయవం
శాకర "వేంకటాద్రి" సుకలాఢ్యుఁడు పెక్కుప్రబంధరాజముల్
లోకములోన నిల్పె గుణిలోకము మెచ్చఁగ మీరునట్లె భా
షాకలకంఠికంఠమునఁ జారుసువర్ణవిభూషణావళుల్
తేఁకువఁగూర్చుఁడయ్య ! ప్రయతించి శమాభరణా ! లసద్గుణా
లోకము లేలు 'భావసురలోకవిభుండు శుభంబు లీవుతన్ ॥

శ్రీ రా జా వా సి రె డ్డి శ్రీ రా మ భా ను భూ పా ల

కల్యాణమహోత్సవార్పిత

# నవరత్నాని

చల్లా సత్యనారాయణశాస్త్రిణా

క్రీడారఙ్గో నిజభుజబలా ద్యుద్ధరం గోపియేషాం
యేవై భూపా చ్చకితహృదయా ద్వాసిరెడ్డీతిగీతాః
సోఽయం వంశే స్సకరుణదృశా వీక్షతే జంపతీ వామ్
కర్తృశ్యార్ధేఽభినుతగురు శ్శఙ్కరశ్శఙ్కరోఽస్తు

విశ్వఖ్యాతో విమలవిభవో వాసిరెడ్డ్యన్వవాయః
యత్రైవాసన్ ప్రథితయశసో వేంకటాద్రిప్రధానాః
తద్వంశీయం వినయమధురం ప్రాణనాథం భజన్త్యాః
భారత్యాస్తే హరిహరవిభు శ్శ్రేయసే భూయసేఽస్తు

యావైబాల్యా దవగతసుఖా సాహసా ద్ధికృతారిః
సంస్థానం యా గళితవిభవం సుస్థిరం కల్పయన్తీ
ఆకాంక్షన్తీ ప్రతికలమహో న్వారసం చాప్తకామా
లక్ష్మీ ర్ధన్యా సరసగృహిణీ దంపతి శ్రేయసేఽస్తు

ముదా సేవకానీక పీడా వినాశే,
కృతాశా సదా పార్వతీశ ప్రసాద
ప్రశాన్తాధికామా దిదోషా, హృష్యేపేవ,
స్థిరా భానుభూపాల భోగై రమస్వ

కిమన్యై రసంఖ్యైస్తు తేఖైః క్రియన్తాం,
భవత్త్రాత సుస్థాపితా దేవదేవాః
శతాన్తా విరాజన్తి లోఽ కేద్య తాత!
నిరీక్షస్వ తాః భాను భూపాల! రామ!
న తేఽసత్యసంధాః కృతజ్ఞా, ఋణజ్ఞా,
ముదావంశవృద్ధిం కరా, శ్శుచ్యరా స్తే
సదా, పుత్రపౌత్రాభివృద్ధ్యా రమేతాం
వియోగో న భూయా చ్చిరం చాయు రస్తు
పరజనేషు ధనేషు గతస్పృహాః,
అతిథి యాచక దీన కృతాదరాః
నమత మంగళకావ్య బుధాదికం,
భజతసౌఖ్య మమంద మహర్నిశమ్.
ప్రతిదినం హృదయశ్రితభానుమాన్,
శశధరోఽపి నవోనవ ఏజతే
ఉపసమగ్రగతౌ భువి విశ్రుతౌ
వితరతాం చిర మాయు రిహాశ్వినౌ.
భానురేవ భరత శ్రుతిరిత
స్తస్యదీప్తి రిహ భారతీద్యుతే
భారతీ భరత సంగమా, చ్చిరా
ద్విశ్వస్మ ద్విగత కల్మషోఽవతాత్.
నమాన్యం ప్రదేయం ప్రభూతం యదాస్తే
శతాతీత గ్రామప్రదాతా హి తాతః
ఇయం భానుభూపాల కల్యాణ వేళా
నవైవాద్య రత్నానిదత్తానిప్రీత్యా.

## శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీ రామభానుభూపాల

కల్యాణమహోత్సవార్పిత

# నవరత్నములు

చల్లా పిచ్చయ్యశాస్త్రి

శ్లో॥ శ్రీ కలాపూర్ణసదనా ధీకలా పూరితాననా
ప్రసాదబహుదా భూయాద్రామభానుస్వభారతీ

సారప్రస్ఫుట భావసూచి దరహాసంబుల్ కలాపూర్ణముల్
తోరంబై మెఱయన్ దనుద్యుతులు చేతోమోదముం గూర్పఁగా
శ్రీ రేఖల్వెలయించు శ్రీ మమ్మాఁ గుతో సీతామహాదేవితో
శ్రీరామ ప్రభుఁ డీవధూవరులకున్ శ్రేయంబులన్ గూర్చుతన్

జగదానందకరుండు, వేదమయి భాస్వన్మూర్తి, బాహ్యాంతరం
బగు పెంజీకటిఁ దోల్చువెల్గు, కిరణ వ్యాసంగ సర్వాశయ
సగితాయుఃపరిపుష్టి, కంటికెదురన్ దైవారు భానుండు, తా
సుగుణోపేతుల నీవధూవగుల కిచ్చున్ గాత దీర్ఘాయువుల్

లలిఁ దనయుత్తమామలు కలాసముదంచిత కోడలంచు స
ర్మల మణిహారముఖ్యముల మన్ననఁజేయ నిజాననోదిత
మ్మౌ లలితశబ్దరత్నమయమున్ నవహార మొసంగుభారతీ
లలన విరించియున్ శుభవిలాసము, రాద్యుగళమ్ము, నోముటన్

భాగవతాదులం, గృతుల; పాపయముఖ్య మహాకవీంద్ర వా
చా గవిపాలు గ్రోలెను,యశమ్మునుగాంచెను, పొందెభోగముల్
త్యాగము 'వేంకటాద్రినరనాథు' డుఁదా్రడియుసంస్కృతాంధ్రభా
షా గరిమంబు నిల్పె నటు చక్కఁగ నోము యశస్ఫురన్ వరా

క॥ నిరతము వంశము వృద్ధిన్
సిరి పెంపును గూర్చి కీర్తిఁ జెలఁగెడు లక్ష్మీ
నరసాంబిక మదిమెచ్చన్
వఱలుఁడు శ్రీరామభాను భారతులారా !

సీ॥ సౌధాంగణమునందు శ్రవణాంగణమునందు
మంగళ ధ్వనులు చెలంగుఁ గాత
ఆకృతులందు భాషాకృతులందును
బోషణాదరములు, పొసఁగుగాత
ఉభయ వంశంబులు నుభయ దైవతభక్తి
యుత్తరోత్తరవృద్ధి నొందుఁగాత
సంగీత సాహిత్య సౌహిత్యమును నిత్య
మానందరసధి నోలాడ్చుఁగాత .

గీ॥ కంఠభాగంబులను నలుగడల స్ఫార,
భాంచిత యసస్సుమాళి రంజించుఁ గాత
రామభానుప్రసాదభారతుల యువక,
రాజదంపతులను శుభారంభయుతుల

గీ॥ శంకరప్రసాదము గుటఁ బ్రసాదపదము,
తలఁపులనొసంగుటను బహాదర్ పదంబు

తగియెను దదర్థమునుసదా తలపుమయ్యా!
రామభానుప్రసాద వరా! గుణాఢ్య!

గీ॥ పార్వతీ పరమేశులు శ్వశురు లరయ,
వరుఁడు శ్రీ రామభానుభవ్యగుణరాశి
ఉభయ వంశంబులును నట్టు లుభయభాష,
లానసమెలంగుమమ! భారతీ! నవోఢ!

ఆ శీ స్సు

క॥ చిఱుమామిళ్ళ వసంతము
• నరసన్నార్త్రినెఱపె ననిచెనటుల్ శ్రీ
కరమగు గ్రీష్మర్తువునన్
సురుచిర శ్రీసూర్యదేవ సురుచియొసంగన్

క॥ "హరిహరప్రసాదబహదర్"
పరిణయమునయందు నెట్లు ప్రజకానంద
స్ఫురణమొ యట్టిదతత్సుతు
పరిణయమున నమరెనెల్ల వారికి బళిరే

గీ॥ సూర్యశివరామసత్యాది సుగుణనిధులు
రామదేవరసంజీవ రాయకృష్ణ
వరులు శ్రీరామభానుభూపాల భార
తీవివాహమహోత్సవ శ్రీవిరిసిరి

ఇ తి శి వ మ్

# శ్రీ జయదేవ చరిత్రము

శ్రీజగదీశ్వరున్ సతముఁ జేతమునందున నిల్పి సర్వమున్
వ్యాజము లేనిభావమున బ్రహ్మమయంబుగఁ జూచుచుం బద
శ్రీజతపం బెఱింగి కృతిఁ జెప్పి జగత్పతిపేరు గన్న శ్రీ
"శ్రీజయదేవ" సత్కవిచరిత్రముఁ జెప్పెదఁ బద్యపద్ధతిన్॥

కం॥ కలదు 'జగన్నాథమ్ము'న
కెలనం దనరారు విబుధగీతులతోఁ జె
ల్వొలయించు నిందుబిల్వా
ఖ్యలసచ్ఛి యొక్క గ్రామ మానందదమై॥

గీ॥ అందునను వ్యాసనారాయణాంశమందు
నుదయమై బ్రహ్మవంశంబు నుర్విఁ గీర్తి
రాజహంసీముఖమ్మున రహిఁకెక్కి గూర్చి
యొప్పు జయదేవుఁ డనుకవి యుచితవేది॥

కం॥ తనవాఙ్నైపుణిమై చ
క్కని శైలిని మాతృభాషఁ గవిరాజులు మె
చ్చను గూర్చి 'యష్టపదముల'
గొనబుగ రచియించె గీతగోవిందమ్మున్॥

ఎడ తెగ కెల్ల వేళల మహింగల శ్రోతలు వక్త లోలి నె
క్కుడుతమకంబుతో నతని కోమలగానకవిత్వపద్ధతిం

బడి చను దెంతు రాదృతి నుపాయనముల్గొని యమ్మహాత్ముఁ జే
రెడుసిరి యెంతవారికని హృద్యముగాఁ దలపోయుచు న్వడిన్॥

హరిచారిత్రముదక్కఁ బల్కఁ డొకమిథ్యాలోకవృత్తాంతమున్
హరిపాదార్చన దక్కఁ జూడఁడు వృథాహంకారహుంకారునిన్
హరిగానశ్రవణంబుఁదక్కఁ గొనఁ డన్యార్థగానస్తుతుల్
హరియే తా జయదేవుఁడయ్యె నన నేలా యింకసందేహముల్॥

క॥ ఆకవికృతి యాదేశం
బేకచ్ఛత్రాధిపత్య మెసఁగఁగఁ బ్రజలన్
సాకెదు సాత్త్వికరాజ ట
నేకాంతమునందుఁ దలఁచె నిట్లాకరీతిన్॥

ఎల్లరు బిందుబిల్వసుకవీంద్రుఁడు కూర్చినగానకావ్యమున్
గొల్లగఁ బాడుచుండి రిలఁ గూనలు పెద్దలుఁ బూవుబోండ్లు నా
యల్లినకావ్య మొక్కఁడును నారయఁడయ్యెను గాన శాసనం
బెల్లెడఁ జాటఁబంచెద నిఁకెవ్వరుచూడరొ మంత్రబంధమున్॥

క॥ అని చాటఁబంచె "జయదే
వు"నికావ్యము వలదు కొనుఁడు భూపతికావ్యం
బనఘం బనినం గొనరె
రనయం బెటు సాగు నొడయఁడ గుమాత్రమునన్॥

అంతన్ రాజు విమర్శమేది మది సంఖ్యావంతులంబిల్చి యే
కాంతమ్మందునఁ దత్ప్రబంధమును నీయస్మత్ప్రబంధమ్ము స
ర్వాంతర్యామి జగన్నియామకుని ప్రత్యక్షమ్మున న్నిల్పి శ్రీ
కాంతుండెద్ది గ్రహించు నద్దియయగున్ గ్రాహ్యంబులో కాలికిన్॥

గీ॥ అని జగన్నాథునకో వెలయందు రాజు
గీతగోవిందమును దనకృతిని నిలిపి
తలుపు తాళమ్మును బిగించి తరలిపోయె
నెల్లవారలతోఁ గూడ నెదలుపొదల॥

క॥ మఱునాఁడు తలుపు తెఱవఁగ
సురవనమందారముఖ్యశుభమాల్యమిళ
త్పరిమళమై కన్పడె శ్రీ
గురియుచు హరిమ్రోల గీతగోవింద మటన్॥

గీ॥ ఎల్ల రచ్చెరువంది రేలికయును గడుఁ
జిన్నవోయి సుకవిఁ జేరి వ్రాలి
తప్పుసేసినాఁడఁ దలఁపక సైరింపు
మయ్య! గుణనికాయ్య! యనఁగజనక॥

ఆ॥ దేవళంబుఁ జేరి దేవేశ! యోజగ
న్నాథ! నీకుఁ దగునె నరులుపోలెఁ
బక్షపాతబుద్ధిఁ బ్రకటించి నిల్వఁ
దనువు నింక నీకె ధారఁగూర్తు॥

సీ॥ అనుచును సాహసికృత్యముఁ జేయ శ్రీహరి
భక్తవత్సలుఁ డౌటఁ బ్రభువు నెదుర
బుండరీకమ్ములఁ బొల్లులువో దిద్దు
వెడఁదకన్నులఁ గృపావృష్టి కురియ
దోఁచి యెంతకుఁ జొచ్చితే చిరంజీవి రా
జా వరశతసహస్రంబు మనుము

ప్రజల బిడ్డలబోలెఁ బరిపాలన మొనర్చు
మాజయదేవు కావ్యంబునందు

గీ॥ నలరు నిర్వదినాల్గుపద్యములు నీవి
జగమునం దెందుఁ గవిరాజచక్రవర్తి
కీర్తి నీకీర్తియును జెల్మిగీములగుచు
నక్కసెలియంద్రడనడవడి కగునుచూవె॥

క॥ అని నృపునలరించి ఘనా
ఘనసచ్ఛాయప్రభుండు క్రమ్మఱఁ జేరెన్
దన నెలవు రాజు మోదం
బున శ్రీజయదేవుమైత్రిఁ బొలుపుగ నుండెన్॥

అను వాక్షేత్రమునందు నొక్కయెడ నొప్పారుఁ ధనాఢ్యత్వతన్
ధనదుఁ మారొక్కనియొక్క బ్రాహ్మణుఁడు నిత్యజ్ఞానసంపన్నుఁడై
చను బీదం గనుసన్నఁ బిల్చి యెద వాంఛం దీర్చు నా వేత్తకున్
జను నొక్కర్తుక కన్య చంద్రకల నాఁ జర్చించి తద్వైఖరిన్॥

గీ॥ పేరువెట్టెను పెద్దలఁ జేరఁబిల్చి
శ్రీవిరాజిల్లఁ గూర్మిఁ బద్మావతి యన
వర్ధిలుచునుండె సంస్కారవంతు బుద్ధి
వృత్తియటు లుత్తరోత్తర వృద్ధి యెసఁగ॥

కన్నులు మోముఁ బాదములుఁ గన్గొని శ్రీ నెలవంచుఁ జేరెదున్
నెన్నుదు రక్కగారనుచు నెక్కొని పిల్చును చంద్రశేఖరున్
నెన్నడు మొద్దు లక్ష్యమున నిల్చును తాల్చును తారహార మ
ధ్యున్నతవక్ష మయ్యువిద కొప్పు విలాసము చెప్పశక్యమే॥

సీ॥ అంతట నొక్కనాఁ డాకన్యజనకుని
కేకాంతమున జగదీశ్వరుండు
ప్రత్యక్షమునఁ బల్కెఁ బ్రాభవోపేత ! నా
యంశంబునం బుట్టె నవనియందు
బిందుబిల్వమున బుధేంద్రుఁడు కవిరాజు
కడల కెక్కినవాఁడు గానమందు
కళలయందును బదకమనీయతను మహా
మహిమాఢ్యుఁ డఖిలసమత్వవేది

గీ॥ తగినవాఁ డయ్య ! నీదునందనకు పెండ్లి
కొడుకుఁ గావించుకొనుము వంగడము వారు
మెత్తు రెల్లరు మెత్తురు మేలువాడముఁ
దడమసేయకు మనుచు నంతర్థిఁ గొనియె॥

గీ॥ అట జగన్నాథునాజ్ఞ బ్రాహ్మణుఁడు వేగఁ
బిలువనంపించి జయదేవు వెలయు విభవ
మొప్పఁ బద్మావతి నొసంగె నుబ్బువెల్లి
మునిఁగి వంశస్థు లున్నతభూమి కెక్క॥

గీ॥ అంతఁ బద్మావతీయుక్తుఁ డగుచు నిందు
బిల్వమందున జయదేవవిబుధమౌళి
సుకవితారాజ్యమున జగత్సుతులు వెలయ
శిష్యులుఁ బ్రశిష్యులును గొల్వఁ జెలఁగుచుండె॥

అంతటఁ గొన్నినాళ్ళ కొకయార్యశిఖామణి యూరుజుండు శ్రీ
మంతుని నిందుబిల్వకవిఁ మన్ననయొప్పఁ బ్రపత్తిఁ జేరి మా

రెంతయుఁగూర్మిమున్మఁదరియింపఁగఁజేయఁగమత్పురంబు శ్రీ
కాంతపురంబు జేయఁగనుకాంక్షయనంగవి రాజు మెచ్చుచున్॥

గీ॥ వైశ్యరత్నంబుతోడఁ దత్పట్టణంబుఁ
జొచ్చి హరిభక్తిమార్గంబు చొప్పు జ్ఞాన
భూతివైరాగ్యసౌఖ్యంబు బూసగ్రుచ్చి
నట్లు బోధించుచుండె నవ్యాహతోక్తి॥

కొన్నాళ్ళీగతినుండి యన్నగరమున్ గూఢజ్ఞముం జేసి ప్రాం
చన్నిరంధ్రయశస్సుధాసుకవిరాట్చంద్రుండు స్వగ్రామపీ
ఠ స్నేహోన్నన్న నెఱింగి వైశ్యమణి బంగారంబు రత్నావళుల్
మున్నౌవానిని శిష్యకోటి కిడి యామోదమ్ముతో భక్తితో॥

పనిచెను మీఁద వచ్చునెడ బాటను వైశ్యభటుల్ ధనాప్తిమీ
చ్చను గనుగాన కాసుకవిచంద్రునిచేతులుఁ గాళ్ళుఁ గోసి బో
రన విపసత్త్వయుక్తమగునట్టి యొకానొకపాడునూఁతిలో
నను బడవైచి యేగిరి ధనంబిల నేఁతబుసేయ దారయున్॥

కవిమణి యంత దైవవిధి కంజభవాదులకేని దాటఁగా
నవునొకో యంచు నెంచి తనయాత్మ వినిశ్చలవృత్తి రాధికా
ధవు పదపద్మయుగ్మమునఁ దార్కొనఁ జేసి సమాధినిష్ఠుడై
రవిమయియందుఁజేఁకటేఁదిరస్కృతిఁజేయుచునుండె గ్రొత్తగన్

గీ॥ వేణువూదినట్లు వెలయించు నాకవి
కంఠగానమునకుఁ గదలిలేచి
పడగవిప్పి యాడు ఫణులు శిరోమణి
ప్రభ లయత్నముగ నివాళులిడఁగ॥

గీ॥ అట్లు జయదేవకవి బావియందుఁ దాను
తెగిపడిన నింటనుండినపగిదిఁ గృష్ణ
గానలీనాత్ముఁడై యుండెఁ గాలవశత
నెనసె నచటికి వింధ్యదేశేశ్వరుండు॥

ఆ॥ చేరి పాడుబావి శ్రీమణికాంతిరిం
ఛోళి వెలయ నరుణు చొప్పుఁ జూపు
కవికులేంద్రుఁ గాంచి కంప మాశ్చర్యంబుఁ
బ్రమద మెదను బొదలఁ బలికె నిట్లు॥

ఆ॥ ఓమహాత్మ! యెవ్వఁ డేమికారణమున
ని న్నిటుల్ పొనర్చె నెమ్మి గదురఁ
దెల్పు మన్నఁ దెల్పెఁ దేటల దీవి నా
భవము యిట్టి దనుచు బదులు సెప్పె॥

విని యారాజెదఁ బొంగి యిట్లు వలదా వేత్తృత్వమన్నట్ధరన్
దను హింసించినవానిఁ జెప్పఁ డిక నీధన్యాత్ము సాంగత్యల
బ్ధిని నేఁగాంచెద బాధమోక్ష మనుచున్ వేఁజేర్చె ధామమ్ము శ్ర
ద్ధ నొగిం దావినుచుండె లక్ష్యమిడి తద్ధర్మంబు లశ్రాంతమున్॥

ఆకవి చెప్పినట్లు తనయండకుఁ జేరినవారి నందకృ
ష్ణాకృతి నెంచి సేయుఁ బ్రమదాంబుధిఁ దోఁగి సువర్ణపూజయా
లోకము వారిపాదములలోఁ దిరుగాడఁగఁ జేయు నిత్య మి
ట్లైకడలెక్కఁగాఁ బ్రథిత యానృపుచెంతకు సాధువృత్తితో॥

ఆ॥ మున్ను తన్నుఁ గోసి చన్న వైశ్యనిభటు
లతిథికోటిఁ జేరి యరుగుదేర

సుకవి కాంచి చెప్పె క్షోణీశుతో నింత
వార లింతవఱకు రారు రారు॥

క॥ వీరికి విశేషపూజలు
శ్రీరమణుని నిలిపి నీదుచిత్తము నందున్
వేరచియింపు తరింతువు
భూరమణా? యనిన నట్లుపూజించి యటన్॥

క॥ ధనకనకవస్తుమణి వా
హనములుఁ బరిజనము నిచ్చి యంపించి యటన్
చనునెడ నృపభటు లాదొం
గనిరాబారులను భక్తి కడలుగొనంగన్॥

అందఱికన్న నెక్కుడుగ నారసె మాకవి మిమ్ము మీరు వీ
రెందయినన్ సుహృత్త్వమువహింతురె తెల్పుఁడటన్న నేర్పుగాఁ
దొందరతొట్రులేక తమతోయము తెల్పిరి వక్రపద్ధతిన్
ముందును వెన్క జూతురొకొ మూర్ఖులు గాఢతమఃపరీవృతిన్॥

క॥ ఆమే లెదనుంచియు మా
కీ మేలొనరించె నన్న నిరువయ్యలుగా
భూమి పెతాలున వీరిలెన్
తో మూర్ఖులు కూలిరందుఁ దునియలుగాఁగన్

ఆ॥ అట్టులగుట నెఱిఁగి యాకవిరాజు చిం
తించి కృష్ణ! మున్ను తృణ్యరూపు
గొన్నయసుర కిడవె పెన్నిధియగుముక్తి
వీరి నట్లతేర్పవే దయాబ్ధి!॥

సీ॥ అని యార్తుఁడయి సర్వ మాత్మఁగాఁ దలపోయు
మహితాత్ము, డతఁడు నెమ్మదిని బొగడ
హరి తనవాసమ్మునందుఁ జేర్చెను వారి
నాకవి కెప్పటియట్ల యంఘ్రి
కరము లొప్పఁగఁజేసె గగనమండలమున
సురదుందుభులు మ్రోఁగె సురకవీంద్రు
వాఙ్మయపుష్పప్రవర్షంబు లొప్పెను
గంధర్వగానంబు క్రమ్మె దెసలఁ

గీ॥ బద్మగంధమ్ములను వీఁచెఁ బవనశిశువు
భక్తులెల్లరు రోమాంచఁ భరితులైరి
వింధ్యదేశాధిపతియుఁ గర్వించె నిట్టి
కవి సహత్వంబు నాకబ్బెఁగా యటంచు॥

అంతట భూపతి మున్నె తా సుకవిజాయాదివ్యమాహాత్మ్యము
ద్రాంతమ్ముల వినుచుంటఁ బత్నిని కృతార్థం జేయఁగా నెంచి యే
కాంతమ్మం దోఁగి నిందుబిల్వకవికిన్ గైమోడ్చి ప్రార్థింపఁ ద
త్స్వాంతాభీష్టము గుర్తెఱింగి యిడె నాజ్ఞన్ వేత్త భూభర్తకున్॥

ఆదట బిందుబిల్వమున కానృపరత్నము తాన యేఁగి శి
ష్యాదరవృత్తిఁ దత్కవికులాగ్రణిపత్నికి భర్తృవృత్త మా
హ్లాదముతోడ విన్చె విని యాసతియున్ రథమెక్కెఁ బద్మప
ద్మాదరహాసచంద్రిక రథస్థమణీఘృణి మేల మాడఁగన్

గీ॥ వింధ్యదేశాధిపతి యంత వేడ్కతోడఁ
జేర్చె జయదేవకవిరాజు చెంత కింతి

మిన్న పద్మావతీదేవి మెఱుఁగువోలెఁ
దళ్కుమని యామెయును నాత్మధవుని కెఱఁగె॥

గీ॥ అంతఁ దద్భావబంధసిద్ధాంతమేమొ
కవియుఁ గవయిత్రియును గొన్నిగడెలు చూచు
కొనిరి యొండొరు వర్షించెఁ గ్రొత్తయమృత
ధార ధన్యతఁగాంచె వింధ్యప్రభుండు॥

నిజశుద్ధాంతముఁ జేర్ప నెంచి కలికీ! నీ విందు రాఁగోరె నీ
బుజుమార్గానుచరుండు కావున సతీవృత్తమ్ము రాధామనో
బుజమత్తాళికథాళిగానమును సమ్మోదస్థితిన్ ధర్మపు
ష్పజసౌగంధ్యముఁ దత్సతీవితతికిం జక్కం బ్రబోధింపుమా॥

క॥ అనె నటఁ బద్మావతియును
జనవరుశుద్ధాంతమునకు సతులిరుగడలన్
వినయవిధేయత వీవన
లను విసరుచు రాఁగ నేఁగెఁ లక్ష్మియపోలెన్॥

ఒకదిన మొక్క ధర్మము సముజ్జ్వలవాగ్ఫణితుల్ చెలంగఁగా
సుకవుఁగఁ దేటతెల్లముగ శోభనగీతుల నెల్లధర్మముల్
ప్రకట మొనర్చె రాట్సతులు భారతి మమ్ముఁ దరింపఁజేయ భూ
మికి నిటు వచ్చెనంచు మది మెచ్చుచుఁ గొల్చుచునుండి రాదృతిన్॥

గీ॥ ఒక్కనాఁ డట రాట్సతు లోలిఁ గొలువ
నొప్పెఁ బద్మావతీదేవి మెప్పుగాంచి
ఇట్టులుండఁగ నొకభటుం డేగుదెంచి
తెలిపె నొకవార్త రాట్పత్ని యులికిపడియె॥

గీ॥ చెలులు పరితాపమందిరి చీలెఁ గొల్వు
నుండెఁ బద్మావతీదేవి నిండుకుండ
యట్టు లశ్లాట కరయక యప్పురంధ్రి
పలికెఁ బద్మావతింబిల్చి పట్టువట్టి॥

తమ్ముఁడు బ్రమగ్గినమ్మ యటఁ దత్పతి తోడుగమించె నన్న వా
క్యమ్మును విన్నమాత్రమున నందఱు నావలె నీరుగాఁగ నీ
వుమ్మలికంబు నంతయిన నూనవు లో నిటులొప్పనొక్కొ మా
యమ్మరో! యన్న నవ్వి యను నాకవిరాజపురంధ్రి యాగతిన్॥

సీ॥ కాలవశంబులై గతములౌ మేనుల
కేడ్చిన లాభమేమీ పురంధ్రి!
వగపు జేర్చినగుండె వ్రయ్యలౌఁ గావున
నద్దానిఁ జేరనీ యదు బుధాళి
పతియూర్పుఁ దనయూర్పు జతసేయవలెఁ గాక
చిచ్చునంబడుట ప్రసిద్ధవిధియె
కలవారు లేనివా రిలనొక్కరూపగా
మృత్యుదంష్ట్రికు పటాత్కృతికరినకు

గీ॥ తత్త్వ మిదియన్న విని మదిఁ దగిలి రగిలి
కాల్చుచింతాగ్నిశమియింప గాఢభక్తి
మ్రొక్కి పద్మావతికి రాజ్ఞి మోదమూనె
తొంటియటు లట్టులయ్యె లోఁదొలుచు వికృతి॥

చెప్పుటకేమి ధర్మములు చేయువతెంగద యొక్కఁడేని నం
చప్పుడ కొల్వుకూటమున కంపి యొకానొకచారు మంత్రివా

గప్పటిఁబిల్చి చెప్పెఁ గథనంతయు నాతఁడు నేఁగి రాలినాఁ
డప్ప కవీంద్రుఁడంచుఁ గబురంపెను మేడకు దీనవాక్కులన్॥

గీ॥ రాజపత్ను లమంగళారావమెసఁగఁ
జుట్టుకొనుటకు మున్నె యాబిట్టుపలుకు
నాలకించిన తోనఁ బద్మాయతాక్షి
కూలెఁ బద్మావతీదేవి తూలిరాజ్ఞి॥

ఏమీ యీగతియయ్యె నక్రమముగా నేనాపరీక్షించు టీ
భామారత్నము బుద్ధిలోపమున సంపద్గర్వ రేఖం గటా
స్వామిద్రోహ మొనర్చితిన్ నిలువగా శక్యంబె పాపమ్మన్నఁబో
దే మొండింబడి ప్రాణముం దెరువులేదే యంచు భూమింబడెన్॥

ఆ॥ ఎఱుకయయ్యె తేని కెల్లవృత్తాంతంబు
మదిఁదలంచి తానె మ్రగ్గఁదలఁచి
సుకముగా నెసంగు సుకవి శ్రీజయదేవు
చరణయుగళి కేఁగి సన్నుతించి॥

కవిరాజోత్తమ! యాత్మనైక్యపడ నాజ్ఞాపింపుమీ నన్ను నే
భువినున్న న్విపరీతము ల్పొడముఁబో వుర్వ్ ధర్మముల్ మర్మముల్
రవులున్ గాన ననుగ్రహింపు మసిధారాజిహ్వకంజాచె నం
చు విధిం జూపినఁ జూచి గుర్తెఱిఁగి వాక్శుద్ధిం గవీంద్రుండనున్॥

తప్పేమున్నది రాజ! నీయెడను శుద్ధాంతమ్మునన్ గుర్తుకై
యవ్వాబోణి యొనర్చె నట్టు నది యొప్పె దీనికై యీగతిన్

యొప్పం జెల్లు నశాంతిఁ జేకొను మదిన్ రాధాలయా! రాధికా
సుప్రాజ్యున్నిరతమ్ము నిల్పు మది సంశుద్ధప్రవృత్తిన్ స్ఫురన్॥

కం॥ అనుచుం దగునోరిమిక్రూ
ర్మి నితాంతభ్వనినిర్మలతయు మెయికొన నొప్పెన్
జనతారంజనచణమో
హనపావనగానసుకవితాకృతి యంతన్॥

సీ॥ స్థాయిహాయికి మెక్కి తమకులంబున పులుం
గని గండుకోయిల లలముకొనఁగ
రాగానురాగస్వరమ్ము చందమునకుఁ
జే నున్న వీణెయు సిగ్గుఁజెంద
ననుపదపదశుద్ధి కలరి 'బలేబలే'
యని మహాకవులు జోహారు లొసఁగ
ప్రతిభాలవాలాంకురత్కల్పనాకల్ప
లత సరసాళిఝంకృతుల సాగియ

గీ॥ రాధికామాధవులఁ గూర్చి రసములొప్ప
'గీతగోవిందమును' బాడెఁ గేయములుగఁ
బద్యములు మేళవించి తత్పరతమీఱ
యంతఁ బద్మావతియు లేచి యధిపుఁ గొలిచె॥

గీ॥ విరులవాన లొప్పె వినువీథ నయ్యెడ
నిలిచి సాధనముల నిష్ఠ వినిరి

అభ్రముగను కిన్నరాదులు తమపూవుఁ
బోండ్లతోడఁ గవిని పొగడికొనుచు॥

శ్రీనారాయణులే జగత్తరణముం జేయంగ నేతెంచె నీ
మేనుల్దాల్చి యటంచు భూపతి మణుల్ మేలైన భూషావళుల్
కావర్చించి యొసంగి పంచెఁ గవిరత్నంబుల్ సతీయుక్తముల్
దీనిం బాడిన విన్న మాధవుఁ డిడుల్ దీర్ఘాయు రారోగ్యముల్॥

(ఇది జయదేవచరిత్రము)

# శ్రీ సాంధ్ర గీతగోవిందకావ్యము

## —యమునా పరిసర ప్రకృతి—

క॥ శ్రీలీలాగమనాంచ
ద్బాలపవన కేళి కాభవనదగవింద
వ్యాలోలవీచి యమునా
కూలప్రోద్యత్తమాలకుంజము పొంతన్॥

సీ॥ అల్లనఁదలపించియము చలించుచుఁ దావి
మలయానిలుని కేవి మఱుగు దెలుస
వెలుఁగుల వెలయించు వీనులకొాన రవల్
తెలివి తేటల బాట దిటవు వఱుపఁ
గెంపుల ముత్యాలఁ గెరలించు చిఱునవ్వు
ప్రాభవమ్మున హొయల్ బయలుపఱుప
కనకమ్ము గురియు శృంగారంపు మైచేల
భంగమ్ము లేని మెఱుంగు నెఱప

ఆ॥ కవితరత్నాంగుళీయకకరమునందు
కరము రాణించు మురళిజా ల్గరఁచు అవళి
బూని యొయ్యారము వినోదమును నెసంగఁ
గృష్ణనాయకుఁ డొకవితర్దిం జెలంగి॥

గుంపుగ నిమ్ముఖాంబుజముఁ గ్రోలఁగఁ గూడియు మేమునాసికా
చంపక మొంచి వెన్క కటు సాగితి మెట్టులు వచ్చివ్రాలె నీ
తెంపుల తేఁటియంచు నొకతీరయి కుంతల బంభరమ్ముల
ట్లింపుగఁ జుక్క కస్తురి రహింపఁగఁ జేయఁగఁ దావులెల్లెడన్॥

గీ॥ మేలినీలాలసరముల లీల లోలిఁ
జాలుకొనఁ జేయు తరగలచాలు నల్ల
కల్వపూచాందినీ లొప్పుకప్పువాఁక
పొలుపు చెలికానికిం జూపి పలికెనిట్లు॥

గీ॥ కంటె నెయ్యుడ ! యీనిమ్నగామతల్లి
దివ్యరూపంబు వింటె యేతెంచు మధుర
తరనినాదము సోకెనే తనువు పులక
రింపఁగాఁ జేయుచల్లఁదనంపు బెంపు॥

సీ॥ తోయజపత్త్రిపాథోలవంబుల పేరఁ
జాలుగా ముత్యాలు సంతరించి
నవనవలాడు చెందొవలచాళ్పేర ని
గ్గులు మొలతేసు కెంపులు లగించి
వానీరపత్త్రిసంతానమ్ము పేరను
మరకతరేఖికల్ పెరయఁ గొలిపి
ఇందందు మూఁగు నిందిందిరమ్ముల పేర
నింద్రనీలమ్ముల నెలయఁ దాపి

గీ॥ సహజశిల్పకలావిశేషములు తనరఁ
బఱచినది నాఁచుపేరి తివాచి యదిగో
రాజరాజులమున్ హజారములనేనిఁ
గానఁబడ దిట్టి దెందు జగమ్ములందు॥

సరసిజపీఠులందునఁ బచారొనరించుచు నల్లనల్లన
శిరముల నోరగానిలిపి ఔంగులువెట్టుచుఁ దూఁటికాఁడ నొం

డాయఁ దిలకించుచుం బులుఁగు గోచెలికాఁడ! కనంగనయ్యెడుం
గఱులను గట్టుకొన్న త్రిజగంబుల మోహము రూపు లౌనన్॥

సీ॥ ఈఁదుచున్నవి చూడు మెత్తె తోఁకలు మీర
లల్లవే యాల్మ్రాద లవలనుండి
పరుగెత్తుచున్నవి తెరచావ లెత్తుటఁ
బల్లెకారులు మెచ్చుపడవ లవిగొ
నడచుచుండిరి వారె నడరేవు తెరవల్ల
చేఁగట్టుకోడ లోఁతాగి తెలిసి
కురియుచున్నవి దరితరులు పూఁదేనియల్
భ్రమరేశ్వరాభిషేకము రహింప

గీ॥ చుండి యుండి యవే పొర్లు చుండె మీలు
చెంపకుం జేరెఁడొ కంటిసిరి కొటాల్లు
అల్లవే జల్లులాడెడు నళులు రేఁగఁ
గుంజరమ్మ్రలు ఘుంకారఘూర్ణితములు॥

గీ॥ ఇప్పుడిట మేనినొలయుపయ్యెర యదేమొ
మంచిగంధముఁ బన్నీరు నించి చిల్క-
రించులాగయి హాయి గల్పించె మిప్పుల
సౌరభంబు గుబాళింప సంగడీఁడ!॥

సీ॥ తొలిఁదామరలతావి దొంగిలించినవాఁడు
దొంగిలింపండె చేతోధనమ్ము
వలిపపయ్యెదలను పాయఁదట్టినవాఁడు
పాయఁదట్టండె లజ్జాయవనిక
ననిచియేనుఁగవలె నడవనేర్చినవాఁడు
నడువనేరండె యానందవనమున

వేడ్కఁ గేళీసరోవీచు లూపినవాఁడు
నూపఁడే త్రిజగమ్ము లుబ్బిపోయి

గీ॥ కనదఖిలలోకసంస్కార కారణుండు
మలయభూధరశృంగస మాగతుండు
సకలవల్లినటీనట చక్రవర్తి
దక్షిణానిలుఁ డొప్పె యిత్తటినివజ్జ॥

## సప్తస్వర ప్రకృతి

(స) షడ్జము)

ఓంకృతినంటికంఠమటు లోరగఁజేయుచు నిక్కవెట్టుచున్
గ్రేంకృతు లాచరించుచును గ్రేవల వెన్నెలమొల్కచూడులన్
బింకముఁ జూపుచున్ సఖుఁడ! విశ్వచుఁ బింఛియ మిన్నదీతటా
లంకృతమైన మా పికోన లాస్యమొనర్చుచు నెమ్మిఁ జూచితే॥

(రి) ఋషభము)

రహి నొక్కల్వ్రదుబీఁటి మేఁతకడుపారన్ మేసి శృంగాగ్రమున్
మువాలరుచ్చాలవ మంద జంకెలిడుచున్ ముద్దైన పెన్మాఁపుతో
వహిరోమంథము వేయుచున్ వృషము దే పన్నుండెని య్యేటిపొం
త హిమస్వచ్ఛతనుద్యుతుల్ తతశరద్వ్యోమధ్యముం జూపఁగన్

(గ) గాంధారము

మసృణవిభిన్నకజ్జలము మాద్రి తనుచ్ఛవి కన్నుఁజల్పినన్
షసలక మాటికి న్వగరు మా విచివృళ్లను మేసి బాలకుల్
కగరు కొలఁది గోయన చుఁ గర్ణరసాయన మైనగానమున్
పొసఁగఁగనిచ్చుచున్న దదెము ద్దుగఁ జూడుము గండు కోయిలన్॥

## (ద) ధైవతము

సీ॥ సెలవుల వెడలించుచిఱునుర్వ్వుతుంపురల్
నీలపాత్రికమీఁది పాలుద్రోయ
పలుచని నెమ్మేనఁ బ్రభవించుసుచ్ఛాయ
లలితంపుఁబండు వెన్నెలలు గాయ
నిడుదజాల్మొడమోము నెఱిగాంచి కిన్నరుల్
కిన్నెరల్ సారించి సన్నుతింవ
ధావన వేగ విద్యాపాండితీశక్తి
దండిగుండియ బారునిండు నొడువ

గీ॥ గాలితాకున కేనియుఁ గర్ణయుగళి
నిక్కవెట్టుచు సకిలించు చక్కజముగ
కుచ్చువాలమ్ము మడమల గునిసియాడ
వచ్చుచున్నది కంటె వార్వంబు సఖుఁడ!॥

## (ని) నిషాదము

నిజతుండాగ్రము సాము గఱ్ఱవలెఁ బూనిక్కన్నల్గడల్ద్రిప్పుచున్
గుజ ముల్లీలఁ బెకల్చుచు న్నిజతనూగోళమ్ము ఘీంకారగ
ర్జఁ జెలంగింపఁగ రాజకీవి నడఁజేరన్వచ్చె శ్రీరాజవే
శ్మజయస్థానము చూచితే గుణనిధీ! మత్తేభచూడామణీ॥

గీ॥ ఎల్లరకములయాకుల నెగసిమేయు
చఱుతఁ జిఱుగంట మ్రోయంగఁ గుఱుచతోఁక
కదలఁ గర్ణాంతరము, ఖురాగ్రమునఁ గోకి
కొనుచు నున్నదియదె కనుంగొంటె యజము॥

## మ ధ్య మ ము

క॥ చిఱుగఱులన్ విద్రుచుచుఁ గ్రి
కిఱియించుచుఁ గుతుకసాచి క్రేవలఁ గని వా
తెఱచుచు నఱచుచు నెఱలం
గఱచుచువిహరించుచుండెఁ గ్రౌంచము కనితే॥

## వే ణు వు

ప్రీలినబోలుగొట్టముల వెల్వడునాదము వింతవాద్యముల్
మేలుకొనంగఁజేయు బలిమిం బస రుట్టిపడంగఁ జేయుచున్
బాలకులట్లు చుట్టుకొని పల్లకపున్నిడుమోసలొప్పఁగాఁ
గోల లొసంగు నీవెదురు గుమ్మలు చూచితెయోసుహృన్మణీ.

## గో వ ర్ధ న గి రి

సెలయేళ్ళం దరుకుంజపుంజముల విస్తీర్ణప్రదేశమ్ములన్
లలితస్నిగ్ధసమగ్రశాద్వలములన్ రంజిల్లి యీమేలుక
ట్టులు నల్వంకల నేర్పరించి పలెవాటుంగూర్పు సూర్యప్రభల్
తలపైకెత్తుచుఁ బిల్చుచున్నయది యోతద్గోత్ర మీక్షించితే.

క॥ అని యిటు యమునాపరిసర
మునఁ దనరెడుప్రకృతి మురువుమోహనముగఁ జ
క్కని శైలిని వర్ణించుచుఁ
జన హరి చెలికానితోడ సదనమ్మునకున్॥

క॥ అదట నొకనాఁ డాహరి
మోదాంబుధి రాధతాను మునిమాపున సు
శ్రీ దఁగళిందను జేరుట
సాదరుఁడై తెలిసి సందుఁ డనె రాధికతో॥

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# శ్రీ సాంధ్రగీతగోవిందకావ్యము

## ప్రథమ సర్గము

### జయదేవ మహాకవి ప్రశంస

శ్లో॥ వాచః పల్లవయ త్యుమాపతిధర స్సందర్భశుద్ధిం గిరామ్
జానీతే జయదేవఏవ శరణః శ్లాఘ్యో దురూహద్రుతేః,
శృంగారోత్తరసత్ప్రబంధరచనై రాచార్యగోవర్ధన
స్పర్ధీ కోఽపి న విశ్రుత శ్శ్రుతిధరో ధోయీ కవిక్ష్మాపతిః॥

### మంగళాచరణము

శ్లో॥ ‘మేఘై ర్మేదురమంబరం, వనభువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరు రయం త్వమేవ త దిమం, రాధే! గృహం ప్రాపయ!’
ఇత్థం నందనిదేశత శ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమమ్
రాధామాధవయో ర్జయన్తి యమునాకూలే రహఃకేళయః॥

సీ॥ అల్లిబిల్లిగ శబ్దపల్లవంబులఁ గూర్పఁ
ప్రఖ్యాతిఁ గనె "నుమాపతిధరుండు
శృంగారకావ్యనిర్మితి రసపుష్టిఁ జే
ర్పడసె "నాచార్యగోవర్ధనుండు"
సద్భావచంద్రిక శారదసంపత్తిఁ
దనియించె 'శరణసత్కవివిభుండు'
కవిలోకమునను శాస్త్రవశబ్ద మొందును
శ్రుతిఁ జేర్చ కలరెను 'శ్రుతిధరుండు'.

"ధోయి" కవిరా జనంగ నంతొఁ గనెఁ గడల
నిందఱవిశేషము లెకాక యంద మెఱఁగి
శబ్దసందర్భశుద్ధిఁ బ్రశస్తిఁ గాంచెఁ
బుడమి 'జయదేవకవిరాజు' బుధుల మోజు॥

కరిమ్మోన్ మబ్బులుమింట మెండుగ వనుల్ శ్యామంగులన్నారోకనుల్
జిమ్మం జీఁకటి రే భయస్థుఁ డితఁ డిల్సేర్పద్దగున్ నీవ వే
గమ్మా, రాధ! యటంచు నందుఁడనుపన్ గాళిందిఁ గుంజంబులన్
నెమ్మిం గేళిఁ జరించు రాధహరియున్ నిండించు తన్ బ్రేమమున్ । 2

శ్లో॥ వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మా
పద్మావతీచరణచారణచక్రవర్తీ
శ్రీవాసుదేవరతికేళికథాసమేత
మేతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్॥

శ్లో॥ యది హరిస్మరణే సరసం మనో
యది విలాసకలాసు కుతూహలమ్
మధురకోమలకాన్తపదావలీం
శ్రుణు తదా జయదేవసరస్వతీమ్!॥

గీ॥ [1] వలుకువెలందికిఁ జిత్రశిల్పములసౌధ
సీమగా మది పద్మావతీమహిళయు
వెరవున నటింప "గీతగోవిందకావ్య"
మొకటి రచియించు జయదేవసుకవిరాజు॥ 3

గీ॥ శ్రీహరిధ్యానమున మది చెంగలింపఁ
గలలను విలాసముల గుతూహలము గలుగ
మృదుమధురకాంతపదముల మిళిత మైన
సుకవిజయదేవకవితను సుజన ! వినుము !॥ 4

1 పాఠాంతరము:- వాణిప్రోన్నదొల్గిన భావసౌధ

సామోదదామోదరమ్ - దశావతారకీర్తిధవళమ్

**మాలవరాగః - రూపకతాళః**

ప్రళయపయోధిజలే ధృతవా నసి వేదం
విహితవహిత్రచరిత్ర మఖేదమ్
కేశవ! ధృతమీనశరీర! జయజగదీశ! హరే! (ధ్రువమ్) 1

క్షితి రతివిపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణిచరణకిణచక్రగరిష్ఠే
కేశవ! ధృతకచ్ఛపరూప! జయజగదీశ! హరే!॥ 2

వసతి దశనశిఖరే ధరణీ తవ లగ్నా
శశిని కళఙ్కకలేవ నిమగ్నా
కేశవ! ధృతసూకరరూప! జయజగదీశ! హరే!॥ 3

తవ కరకమలే నఖ మద్భుతశృఙ్గం
దళితహిరణ్యకశిపవరభృఙ్గమ్
కేశవ! ధృతనరహరిరూప! జయజగదీశ! హరే!॥ 4

ఛలయసి విక్రమణే బలి మద్భుతవామన!
పదనఖనీరజనితజనపావన!
కేశవ! ధృతవామనరూప! జయజగదీశ! హరే!॥ 5

క్షత్రియరుధిరమయే జగ మపగతపాపం
స్నపయసి శమితభవతాపమ్
కేశవ! ధృతభృగుపతిరూప! జయజగదీశ! హరే!॥ 6

## సామోదదామోదరము - దశావతారకీర్తిధవళము

### మాలవరాగము - రూపకతాళము

కడకడలిఁ దిరిగి కని తెచ్చితి శ్రుతులన్
    బడలకయే పల్లెవాఁ డన లీలన్
కేశవా! ధృతమీనశరీర! జయజగదీశ! హరీ॥ 1

నిలిపితిగద పుడమిన్ బలుమూఁపునఁ గొనపై
    బలువు మోచి గొగ్గోలు గననైపై
కేశవా! ధృతకచ్ఛపరూప! జయజగదీశ! హరీ॥ 2

పొలిచెను కొమ్ముచివరన్ భూమండలమెల్లన్
    నెలనడిమిని గళవలెఁ దగి చెల్లన్
కేశవా! ధృతసూకరరూప! జయజగదీశ! హరీ॥ 3

ఎసఁగె నీవ్రేల్గోరు ఎత్తయి పటుఘాటిన్
    కసిఁ జీలిచి రక్కసుఁ డను తేఁటిన్
కేశవా! ధృతనరహరిరూప! జయజగదీశ! హరీ॥ 4

బలిని వంచించితివిగ అలముచు మూడడుగుల్
    తొలిచి విమలపదజలముల సిలుగుల్
కేశవా! ధృతవామనరూప! జయజగదీశ! హరీ॥ 5

కడిగితి త్రిజగములన్ గవితాపము తలఁగన్
    పుడమిఱేండ్ల రుధిరాపగ సాగన్
కేశవా! ధృతభృగుపతిరూప! జయజగదీశ! హరీ॥ 6

వితరసి దిక్షు రణే దిక్పతికమనీయం
దశముఖమౌళిబలిం రమణీయమ్
కేశవ! ధృతరామశరీర! జయజగదీశ! హరే॥ 7

వహసి వపుషి విశదే వసనం జలదాభం
హలహతిభీతిమిళితయమునాభమ్
కేశవ! ధృతహలధరరూప! జయజగదీశ! హరే॥ 8

నిన్దసి యజ్ఞవిధే రహహ! శ్రుతిజాతం
సదయహృదయదర్శితపశుఘాతమ్
కేశవ! ధృతబుద్ధశరీర! జయజగదీశ! హరే॥ 9

మ్లేచ్ఛనివహనిధనే కలయసి కరవాలం
ధూమకేతుమివ కిమపి కరాలమ్
కేశవ! ధృతకల్కిశరీర! జయజగదీశ! హరే॥ 10

శ్రీజయదేవకవేరిద ముదితముదారం
శృణు శుభదం సుఖదం భవసారమ్
కేశవ! ధృతదశవిధరూప! జయజగదీశ! హరే॥ 11

చల్లితి బలి దెసలన్ దశకంఠునితలలన్
  ఎల్లరు దిక్పతు లింపన లీలన్
కేశవా! ధృతరామశరీర! జయజగదీశ! హరీ॥ 7

తాల్చితి నీలాంబరమున్ ధవళం బగు మేనన్
  మెల్చుటఁ జేరిన మిహిర జయయనన్
కేశవా! ధృతహాలధరరూప! జయజగదీశ! హరీ॥ 8

తిట్టితి క్రతువిధులన్ నిగమాగమతతులన్
  పట్టిచూపి దయ పశువధగతులన్
కేశవా! ధృతబుద్ధశరీర! జయజగదీశ! హరీ॥ 9

తునిమితి మ్లేచ్ఛులను గత్తిని ఝళిపించి
  కనలి తోకచుక్కయన నిగ్గించి
కేశవా! ధృతకల్కిశరీర! జయజగదీశ! హరీ॥ 10

విను! జయదేవకృతిన్ శుభమును సుఖదమ్మున్
  దెనుఁగున ఘనకీర్తి ధవళితమ్మున్
కేశవా! ధృతదశవిధరూప! జయజగదీశ! హరీ॥ 11

శ్లో॥ వేదా నుద్ధరతే జగ న్నివహతే
భూగోళ ముద్బిభ్రతే
దైత్యం దారయతే బలిం ఛలయతే
క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలం కలయతే
కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతే
కృష్ణాయ తుభ్యం నమః॥

ఉ॥ వేదము లుద్ధరించి, భువి
　　ప్రేగు వహించి, ధరన్ ధరించి, దు
ర్వాదుని నుత్తరించి; బలి
　　వంచి, దురీశుల నొంచి, రక్కసున్
మోది తెరల్చి, కాంచి హల
　　మున్, గృప బెంచి వధించి మ్లేచ్ఛులన్
ద్రోది దశావతారములు
　　పూనినకృష్ణ! నమస్కరించెదన్॥ 5

హరివిజయమంగళాచారః

## ఘూర్జరీరాగః – నిస్సారతాళః

శ్రితకమలాకుచమణ్డల! ధృతకుణ్డల! ఏ
కలితలలితవనమాల! జయజయ! దేవ! హరే॥ (ధ్రువమ్) 1

దినమణిమణ్డన! భవఖణ్డన! ఏ
మునిజనమానసహంస! జయజయ! దేవ! హరే॥ 2

కాళియవిషధరగఞ్జన! జనరఞ్జన! ఏ
యదుకులనలినదినేశ! జయజయ! దేవ! హరే! 3

మధుమురనరకవినాశన! గరుడాసన! ఏ
సురకులకేళినిదాన! జయజయ! దేవ! హరే! 4

అమలకమలదళలోచన! భవమోచన! ఏ
త్రిభువనభవననిదాన! జయజయ! దేవ! హరే! 5

జనకసుతాకుచభూషణ! జితదూషణ! ఏ
సమరశమితదశకంఠ! జయజయ! దేవ! హరే! 6

అభినవజలధరసున్దర! ధృతమన్దర! ఏ
శ్రీముఖచన్ద్రచకోర! జయజయ! దేవ! హరే! 7

తవచరణే ప్రణతా వయ మితి భావయ! ఏ
కురు కుశలం ప్రణతేషు జయజయ! దేవ హరే॥ 8

శ్రీజయదేవకవే రిదం కురుతే ముదం ఏ
మఙ్గళ ముజ్జ్వలగీతి జయజయ! దేవ హరే॥ 9

హరివిజయమంగళాచారము

భైరవిరాగము - త్రిపుటతాళము

శ్రితకమలాకుచమండల! ధృతకుండల!
విततలలితవనమాల! జయజయ! దేవ! హరీ। 1

దినమణిమండలమండన! భవఖండన!
మునిజనమానసహంస! జయజయ! దేవ! హరీ॥ 2

మదయుతవిషధరగంజన! జనరంజన!
యదుకులనళినదినేశ! జయజయ! దేవ! హరీ॥ 3

సుభగకమలదళలోచన! భవమోచన!
త్రిభువనభవననిదాన! జయజయ! దేవ! హరీ॥ 4

మురమధునరకవినాశన! గురుడాసన!
సురకులకేళినిదాన! జయజయ! దేవ! హరీ॥ 5

నిమికులజాకుచభూషణ! జితదూషణ!
సమరశమితదశకంఠ జయజయ! దేవ! హరీ॥ 6

శ్యామలజలధరసుందర! ధృతమందర!
శ్రీముఖచంద్రచకోర! జయజయ! దేవ! హరీ॥ 7

మేము నీ పదదాసులము అని తలఁపుము!
క్షేమము గూర్పు సంతతము! జయజయ! దేవ హరీ॥ 8

శ్రీజయదేవకవికృతము హరిగీతము
శ్రీజయముల నిడు హితము జయజయ! దేవ! హరీ॥ 9

శ్లో॥ పద్మాపయోధరతటీపరిరంభలగ్న
కాశ్మీరముద్రిత మురో మధుసూదనస్య
వ్యక్తానురాగ మివ ఖేలదనఙ్గఖేద
స్వేదామ్బుపూర మనుపూరయతు ప్రియం వః॥

శ్లో॥ వసంతే వాసంతీకుసుమసుకుమారై రవయవై
భ్రమంతీం కాంతారే బహువిహితకృష్ణానుసరణా
అమన్దం కన్దర్పజ్వరజనితచిన్తాకులతయా
వలద్బాధాం రాధాం సరస మిద మూచే సహచ

గీ॥ కమలకౌఁగిట నొత్తిడిం గ్రమ్ముచనుల
కుంకుమపుఁబూఁత ప్రకటరాగాంకమట్లు
కలయికం దోఁచుచెమ రుబ్బు కమలనయను
కఱకుబంగారుటుర మిడుంగాఁత సిరులు॥ 6

గీ॥ తిరిగియు వసంతమునఁ గృష్ణు తెరవు గనమి
బండిగురివెందపూఁవులవంటి యువయు
వాళి వలఱేని సెగఁ గంద నడలు టరసి
ప్రాణసఖి, రాధికను జూచి, పలికె నిట్లు॥ 7

మాధవోత్సవకమలాకరః

వసన్తరాగః - యతితాళః

లలితలవంగలతాపరిశీలనకోమలమలయసమీరే
మధుకరనికరకరమ్బితకోకిలకూజితకుఞ్జకుటీరే
విహరతి హరి రిహ సరసవసన్తే నృత్యతి యువతిజనేనసమమ్
సఖి! విరహిజనస్య దురన్తే॥ (ధ్రువమ్) 1

ఉన్మదమదనమనోరథపథికవధూజనజనితవిలాపే
అలికులసంకులకుసుమసమూహనిరాకులవకులకలాపే॥ 2

మృగమదసౌరభరభసవశంవదనవదళమాలతమాలే
యువజనహృదయవిదారణమనసిజనఖరుచికింశుకజాలే॥ 3

మదనమహీపతికనకదణ్డరుచికేసరకుసుమవికాసే
మిళితశిలీముఖపాటలపటలకృతస్మరతూణవిలాసే॥ 4

విగళితలజ్జితజగదవలోకనతరుణకరుణకృతహాసే
విరహినికృంతనకుంతముఖాకృతికేతకదంతురితాశే॥ 5

మాధవికాపరిమళలలితే నవమాలతిజాతిసుగంధౌ
మునిమనసామపి మోహనకారిణితరుణాऽకారణబంధౌ॥ 6

స్ఫురదతిముక్తలతాపరిరంభణముకుళితపులకితచూతే
బృందావనవిపినే పరిసరపరిగతయమునాజలపూతే॥ 7

శ్రీజయదేవభణితమిదముదయతి హరిచరణస్మృతిసారమ్
సరసవసన్తసమయవనవర్ణనమనుగతమదనవికారమ్॥ 8

మాధవోత్సవకమలాకరము

వసంతరాగము – యతితాళము

పల్లవి॥ హరి విహరించె వసంతమునన్

అనుపల్లవి॥ తరుణులతో నృత్యము జేయుచు మొగి విరహిజన
దురంతమునన్॥

రంగు హొరంగులవంగలతలను జెలంగుచుఁ బయ్యెరపీచెన్
భృంగఝంకృతులఁగోకిలపంచమసంగతిఁబొదరిండ్లనుబొలిచెన్
పొంగెడుకోర్కులఁబాంధజనమ్ములపొలఁతులదుఃఖము హెచ్చెన్
శృంగారంబుగ నెలదేం ప్లెగయఁగ నెల్లెడఁ బొగడలువిచ్చెన్
కమ్మనికస్తురి గుమగుమ లొసఁగుచుఁ గానుగలెల్లఁజిగిర్చెన్
హమ్మని యువహృదయమ్ముల మరునినఖమ్ములు
మోదుగలు తనర్చెన్॥ 3

మరుఁడనుదొరకిడుబంగరుగొడుగులకరణిఁగేసరంబులు చెలఁగెన్
పొరిఁ దుమ్మెదకదుపుల మరునమ్ములపొదు లటు
పొదిరిపువ్వులు చెలఁగెన్॥ 4

సిగ్గులేనిజగములు గని నవ్వినచెలువునఁ గరుణతరువు లొప్పెన్
నిగ్గుదేఱి విరహుల కీటియలై నెగడి మొగలి తాపులగుప్పెన్
జాతులుగురివెందలు మాలతు లాశలఁ బరిమళములు గొలిపెన్
చేతోభవదాసులైరి మునులును లేతలమాట యిఁకేమగుఁ
దెలుపన్॥ 6

అల్లిబిల్లిగఁరివెందలు మాలతు లల్లై సతీపతియట్టుల్
చల్లనియమునాతటబృందావనసమతలముల సిరిపట్టుల్॥ 7
పదపదమున హరిపదసంస్మరణము పొదల వసంతసమయమున్
బడము లెనిమిదిగగవిజయదేవుఁడువర్ణించెనుసవరసమయమున్॥

శ్లో॥ దరవిదళితమల్లీవల్లిచంచత్పరాగ
ప్రకటితపటవాసై ర్వాసయ న్కాననాని,
ఇహ హి దహతి చేతః కేతకీగంధబంధుః
ప్రసరదసమబాణప్రాణవ ద్గంధవాహః॥

శ్లో॥ ఉన్మీల న్మధుగంధలుబ్ధమధుప
వ్యాధూతచూతాంకుర
క్రీడత్కోకిలకాకలీకలరవై
రుద్గీర్ణకర్ణజ్వరాః
నీయన్తే పథికైః కథం కథమపి
ధ్యానానుధానక్షణ
ప్రాప్తప్రాణసమాసమాగమరసో
ల్లాసై రమీ వాసరాః

శ్లో॥ అనేకనారీపరిరంభసంభ్రమ
స్ఫురన్మనోహారివిలాసలాలసమ్
మురారి మారా దుపదర్శయ న్త్యసౌ
సఖీసమక్షం పున రాహ రాధికా॥

క॥ అరవిరిమల్లియతీవెల
పరాగ మన్యాసెనలను వనములఁ దావుల్
పఱపి మొగలితావుల ద
గ్గఱచుట్టము మరునియూన్చు కరువలి వేఁచెన్॥ 8

చ॥ కవఁ గొనుతీపితావిఁ గొనఁ
గా నళు లూపెడు క్రొంజివుళ్లచా
ల్మివులరహించు మావులను
మేకొను కోకిలకాకలీధ్వనుల్
చెవులకు వేఁడిగాఁ దలఁపుఁ
జేరిన ప్రియుసి పొందువిందుగా
దివసము లెట్టులో వెడలఁ
దీయఁగజాలిరి పాంథు లామనిన్॥ 9

గీ॥ పెక్కుక్రేఁతల కౌఁగిళ్లఁ జిక్కుగొనఁగఁ
జాలుశృంగార చేష్టల సక్కుఁ డయిన
మురళిగోపాలకృష్ణుని మురువు జూపి
క్రమ్మఱన్ బ్రాణసఖి రాధఁ గాంచి పలికె॥ 1

అష్టపది 4–సామోదదామోదర భ్రమరపదము

రామక్రియారాగః – యతితాళః

ప॥ హరి రిహ ముగ్ధవధూనికరే; అ॥విలాసిని!విలసతి కేళిపరే॥

చన్దనచర్చితనీలకళేబరపీతవసనవనమాలీ
కేళిచలన్మణికుణ్డలమణ్డిత గణ్డయుగస్మితశాలీ 1

పీనపయోధరభారభరేణ హరిం పరిరభ్య సరాగమ్
గోపవధూరనుగాయతి కాచిదుదఞ్చిత పంచమరాగమ్ 2

కాఽపి విలాసవిలోలవిలోచన ఖేలనజనితమనోజమ్
ధ్యాయతిముగ్ధవధూరధికంమధుసూదనవదనసరోజమ్ 3

కాఽపి కపోలతలే మిళితా లపితుం కమపి శ్రుతిమూలే
కాఽపిచుచుమ్బనితంబవతీదయితం పులకైరనుకూలే 4

కేళికలాకుతుకేనచ కాచి దముం యమునాజనకూలే
మఞ్జులవఞ్జులకుఞ్జగతం విచకర్ష కరేణ దుకూలే 5

కరతలతాళతరళవలయావళి కలితకలస్వనవంశే
రాసరసేసహ నృత్యపరా హరిణా యువతిః ప్రశశంసే 6

శ్లిష్యతి కామపిచుంబతి కామపి రమయతి కామపిరామాం
పశ్యతిసస్మితచారుతరామపరామనుగచ్ఛతివామామ్ 7

శ్రీజయదేవభణిత మిద మద్భుత కేశవ కేళిరహస్యం
బృందావనవిపినే లలితం వితనోతు శుభాని యశస్యమ్ 8

## రామక్రియా రాగము — యతితాళము

పల్లవి॥ హరి యిటఁ బొల్చె నొయారులలో॥
అ॥ విరివిగఁ గుతుకము విలాసము తమలో॥

మేనంగలపము మెడవనమాలయు, మిసిమిచేలకటి మెఱయన్
వీనులకుండలకాంతులు, చెక్కులఁ బెరయుచుఁ జిఱునగ
వాఱయన్॥ 1

గుబ్బెత యొక్కతె కూర్చి కవుంగిటగోవిందుని యనురాగమునన్
జొబ్బిలుపిల్లనగ్రోవికి మూటిగసాగియఁ బాడె రాగమునన్
ఒక్కతె యోరచూపులఁ బలుకోర్కులనూరించుముఖాంబుజమున్
నిక్కపుగుఱితో నిలిచిమదిని ధ్యానించుచుండె శ్రీధ్వజమున్॥ 3
మొలఁత యొకతె యేమియొ చెలిఁ జెప్పెడుపోలుపునఁ జెక్కులఁ జేరి
పులకాంకురములు పొడమఁగ వీలుగముద్దిడెఁ దమకముమీఱి 4

యమునాజలకేళీలోలాత్మికయయి ప్రబ్బలిపొదరింటన్
రమణి యొకతె లాగెను హరిచేలచెఱఁగు గనుచుఁ గ్రీఁగంటన్ 5

రాసరసంబున నొక చెలియాడుచు రహిఁ గరతాళము లీయన్
భాసురమిది నాపాటకుఁ దగెను సెబాసని హరియుం దనియన్ 6
ఒకతె హత్తు నొడ, లొకతుక ముద్దిడు; నొకతియతో రమియించున్
ఒకరితఁ జిఱునగు మొగమున గనుఁగొను నొక్కతె
నటు ననుగమియించున్ 7

అబ్బురముగ బృందావనకృత శ్రీహరి కేళిరహస్యంబున్
గబ్బమొనర్చెను జయదేవమహాకవి మేల్గలుగ యశస్యంబున్॥ 8

శ్లో॥ విశ్వేషా మనరంజనేన జనయ న్నానంద మిందీవర
శ్రేణీశ్యామలకోమలై రుపనయ న్నంగై రనంగోత్సవమ్
స్వచ్ఛందం వ్రజసున్దరీభి రభితః ప్రత్యఙ్గ మాలిఙ్గితః
శృంగారస్సఖి! మూర్తిమానివమధౌముగ్ధో హరిః క్రీడతి॥

శ్లో॥ నిత్యోత్సంగవసద్భుజంగకబలక్లేశా ది. వేశాచలం
ప్రాలేయప్లవనేచ్ఛ యాఽనుసరతి శ్రీఖండశైలానిలః
కిం చ స్నిగ్ధరసాలమౌళిముకుళా న్యాలోక్యహర్షోదయా
దున్మీలన్తి 'కుహూకుహూ' రితికలోత్తాలాఃపికానాంగిరః

శ్లో॥ రాసోల్లాసభరేణ విభ్రమభృతా మాభీరవామభ్రువా
మభ్యర్ణంపరిరభ్య నిర్భరమురః, ప్రేమాన్ధయా రాధయా
'సాధుత్వద్వదనంసుధామయ' మితి వ్యాహృత్య గీతస్తుతి
వ్యాజా దుత్కటచుంబితస్మితమనోహారీహరిః పాతువః॥

♦ జగము ల్రంజనవృత్తి సమ్మదసుధాసారమ్మునం దేర్చుచున్
దొఁగవూసిగ్గుల మేనఁ గూర్చుచును జేతోజాత ముద్దీపమున్
మొగిప్రేంతత్తమయిచ్ఛమైఁ గవుఁగిటన్నొక్కన్ముకుందుండు తాఁ
దగ శృంగారమురూపముం గొనినచందాన న్వసంతమ్మునన్ ॥11

చెదరక క్రమ్మకొన్న పెనుచిల్వలు మ్రింగుటఁ గల్గుతాపమున్
వదలఁగఁజేయఁగా మలయవాయువు సాగెను మంచుఁగొండకై
సుదతిరో! మావిమొగ్గలనుజూచుచుఁ గొట్టకొటారుకొమ్మలన్
గుదిరి 'కుహోకుహో' యనుచుఁ గూయుచునున్న పికండుఁ
గోయిలల్ ॥ 12

విరియనలంకరించుకొని వ్రేఁతలు రాసమహోత్సవంబునన్
బరిసరమందు నిల్చినను బాళిని గౌఁగిటఁ జేర్చి 'రాధ! నీ
తరసమయంబు నీదు ముఖతామరసం' బని ముద్దులాడఁగా
దరహాసనం బొనర్చెడునుదాత్తుఁడు ప్రోచుత శౌరి మెల్లరన్ ॥13

---

♦ పా:_ఉ॥ ఎల్లరహాయిగాఁ దొఁగల నేలెడి శ్యామలకోమలాంగము
న్వెల్లి సనంగనుత్సవము బెంచి వ్రజాంగన లల్లిబిల్లి మై
నెల్లెడ స్వేచ్ఛఁ గౌఁగిలి రహించుచు లోవెలిప్రీతినొంద రూ
పల్లిన ప్రేమసార మన నామని ముగ్ధమురారి యాడెడిన్ ॥

# ద్వితీయ సర్గః

## అక్లేశ కేశవము

### అష్టపది – 5

శ్లో॥ విహారతి వనే రాధా
సాధారణప్రణయే హరౌ
విగళితనిజోత్కర్షా
దీర్ష్యావశేన గతాన్యతః,
క్వచి దపి లతాకుంజే
గుంజన్మధువ్రతమణ్డలీ
ముఖరశిఖరే లీనా
దీనాప్యువాచ రహః స్సఖీమ్॥

# ద్వి తీ య స ర్గ ము

## అక్లేశ కేశవము

## అ ష్ట ప ది — 5

♦ మ॥ తను సాధారణ మైన ప్రేముడినిజ
త్తస్వామి వీక్షింపఁ గం
దినడెందంబునఁ గుంది రాధ తన యా
ధిక్యంబుఁ గోల్పోయి, చ
య్యన నచ్చోటును బాసి, తేం కైగసి జు
మ్మంచున్ దల న్మూఁగ నొ
క్క నికుంజస్థలి దీనయై చెలికి నే
కాంతమ్ముగా నిట్లనున్॥ 14

---

♦ పా:-ఉ॥ అందఱి నొక్కరూపుప్రణయాన వని న్హరి గ్రీడఁగొల్పుచో
డింద నిజాధికత్వము ఘటిల్లినయీర్ష్యఁ దొలంగి రాధ, పై
పొందికఁ దేంట్లకూటువలు "బొ"మ్మనఁబొల్చు నెదోనికుంజము
న్గందునఁబొందిి చాటఁ బలుకు న్దన నెచ్చెలికి పరిహాస్యముల్॥

## అష్టపది – 5 – మధురిపు రత్నకంఠిక

(తోడి-ధన్యాసి-దేశాక్షరి-ఆది)

ఘూర్జరీరాగః – యతితాళః

ప॥ రాసే హరి మిహ విహితవిలాసం॥ అ॥ స్మరతి మనో మమ కృతపరిహాసం॥

సంచరదధరసుధామధురధ్వనిముఖరితమోహనవంశమ్
చలితదృగంచలచంచలమౌళికపోలవిలోలవతంసమ్॥ 1

చంద్రకచారుమయూరశిఖండకమణ్డలవలయితకేశమ్
ప్రచురపురందరధనురనురంజితమేదురముదిరసువేషమ్॥ 2

గోపకదమ్బనితమ్బవతీముఖచుమ్బనలమ్భితలోభమ్
బన్ధుజీవమధురాధరపల్లవకలితదరస్మితశోభమ్॥ 3

విపులపులకభుజపల్లవవలయితవల్లవయువతిసహస్రం
కరచరణోరసి మణిగణభూషణకిరణవిభిన్నతమిస్రమ్॥ 4

జలదపటలచలదిన్దువినిన్దకచన్దనబిన్దులలాటం
పీనపయోధరపరిసరమర్దననిర్దయహృదయకవాటమ్॥ 5

మణిమయమకరమనోహరకుణ్డలమణ్డితగణ్డముదారం
పీతవసన మనుగతమునిమనుజసురాసురవరపరివారమ్॥ 6

విశదకదమ్బతలే మిళితం కలికలుషభయం శమయంతం
మా మపి కి మపి తరఙ్గదనఙ్గదృశామనసారమయంతమ్ 7

శ్రీజయదేవ భణిత మతిసున్దరమోహనమధురిపురూపం
హరిచరణస్మరణంప్రతిసంప్రతిపుణ్యవతామనురూపమ్॥ 8

ఘూర్జరరాగము - యతితాళము

వ॥ పసఁ గఁయి సీతలఁ బరగి నగించుచు॥ అ॥ ఎసఁగు రాసహరి
నెదఁ బొరిఁ దలఁచు॥

తలయునువాల్యాప్రులుఁ జెక్కిలి చెవిఁగలయవతంసముకదలన్॥
బొలుపుగఁదియ్యనినా తెరముద్దుగ మెఱయుచు మురళియుఁ
బొదలన్॥ 1

కలికితురాయిగ నలకలపైని నెమలిపింఛియమును దిరుగన్
ఎలయు పలురకమ్ములరంగులతో నింద్రధనువువలెఁబరఁగన్॥

పొంకపుమంకెనపూవు జగానిగ బింక మడఁచుకెమ్మోవిన్
ఱంకగ గోపీజనతాధరసుధ లీలం గ్రోలుచు కీవిన్॥ 3

పైదాల్చినమణిభూషణకాంతులమఱుఁగుజీఁకటియుఁదొలఁగన్
బ్రోది వేలకొలఁదిగోపికలు తన్నొబ్దుపఁగఁ బులకలు చెలగన్

కదలుమబ్బులనుబొదలు నెఱఁదెగడునుదుటిచందనము మెఱయన్
ఉదుటిచాచులం దొత్తులమొఱపిడి నుక్కు తునకయెద విఱియన్

చెక్కులమణిమయకుండలకాంతులు చెన్నుగ నృత్యముసలుపన్
నొక్కుల బంగరుచేల గదియఁగ మనుజదనుజసురలు తలఁపన్

కడిమిమ్రానిఁ జేరియుండియడఁచుచుఁగలికలుషమ్ములభయమున్
ఎడఁదఁజూడ్కినను మెచ్చఁ జేయుచురహింగలుగఁగవిస్మయమున్

హరిచరణస్మరణం బొనరుచుపుణ్యాత్ములలరఁగ శుభంబున్
విరచించెను జయదేవుఁడు సురుచిరహరి మోహనరూపంబున్

శ్లో॥ గణయతి గుణ గ్రామం భామం
భ్రమా దపి నేహతే
వహతి చ పరితోషం దోషం
విముంచతి దూరతః
యువతిషు వలత్తృష్ణే కృష్ణే
విహారిణి మాం వినా
పున రపి మనోవామం కామం
కరోతి కరోమి కిం!

♦ చ॥ నను విడనాడి వల్లవజ

నమ్మున గొమ్మల నూగుచుండినం

గనల దొకప్పుడేనిఁ గుతు

కంపడు దోసము లెన్న దెన్ను మే

ల్గానముల మాయకాఁ డనినఁ

గొంచియమున్ విన దీమనంబు శౌ

రి నె పలుమాఱుఁ దాఁ గలవ

రించుఁ, జెలీ!, యిఁక నేమిసేయుదున్

---

♦ పా:- మ॥ వ్యతిరేకించెడి నాకె నామది, వయస్యా!, నాతమి న్వీడి యు

న్నతతృష్ణన్బెఱకాంతల న్నలుఁగు కృష్ణస్వామి నే కోరు స

మ్మతిఁ, గీర్తించు గుణాల, నేమఱియుఁ బెంపంబోదు కోపంబు ద

త్కృతదోషంబుల దవ్వొనర్చుకొని యెంతేన్పొంగు నెట్లో కదే!॥

## అష్టపది 6 – ఆక్లేశ కేశవముంజరీతిలకము

### గుణక్రియారాగః – ఏక తాళః

ప॥ సఖి!, హే కేశిమథనముదారం॥

అ॥ రమయమయాసహమదన మనోరథ భావితయా సవికారం॥

నిభృతనికుంజగృహం గతయా నిశి రహసి నిలీయ వసంతం
చకితవిలోకితసకలదిశా రతిరభసభరేణ హసంతం॥

ప్రథమసమాగమలజ్జితయా పటుచాటుశతై రనుకూలం
మృదుమధురస్మితభాషితయా శిథిలీకృతజఘనదుకూలమ్॥

కిసలయశయననివేశితయా చిర మురసి మమైవ శయానం
కృతపరిరంభణచుమ్బనయా పరిరభ్య కృతాధరపానమ్॥

అలసనిమీలితలోచనయా పులకావలిలలితకపోలం
శ్రమజలసకలకళేబరయా వరమదనమదా దతిలోలమ్।

కోకిలకలరవకూజితయా జితమనసిజతంత్రవిచారం
శ్లథకుసుమాకులకుంతలయా నఖలిఖితఘనస్తనభారం॥

చరణరణితమణినూపురయా పరిపూరితసురతవితానం
ముఖరవిశృంఖలమేఖలయా సకచగ్రహచుంబనదానమ్॥

రతిసుఖసమయరసాలసయా దరముకుళితనయనసరోజం
నిస్సహనిపతితతనులతయా మధుసూదనముదితమనోజం॥

శ్రీజయదేవభణిత మిద మతిశయమధురిపునిధువనశీలం
సుఖ ముత్కంఠితగోపవధూకతం వితనోతు సలీలమ్ ॥

## గుణక్రియా రాగము – ఏకతాళము

ప॥ చెలి!, కూర్పుము హరిశృంగారలహరి

అ॥ వలపుంగఫులగనిచాగ కాఁడునామదివలపించెను మితిమీఱి॥

ఏకతమునఁ బొదరింట నుండ నే నెచటనో తా మఱుఁగయ్యెన్
దూకొను బిత్తరిచూపులఁజూడఁగఁబైకొనుతమినవ్వానకయ్యెన్॥

సాగి సిగ్గు తల వంపఁగ నెలమిని జతురోక్తుల లోఁబఱచున్
సోగనవ్వుతో ముచ్చటాడఁగా సొబగుపిఱుదుచేలను దిగుచున్॥

ఇగురుల సెజ్జను జేఁరగఁ గూరిమి నెదపయ్యెదఁ బవళించున్
బిగికౌఁగిటఁ జేరిచిముద్దిడుచోఁ బెదవితేనెఁగ్రోలునుగ్రోల్చున్॥

చొక్కునఁ గను లరమూయఁగ నునుడాల్చెక్కిలిఁ బులకలు వొడమున్
మిక్కుటముగ నొడలెల్లఁ జెమర్పఁగ మేకొనుమరునాగడమున్॥

కోకిలపారావతముల యెలుఁగిడఁ గొక్కోకము పరిశీలించున్
కూకటివీడి విరులురాలఁగఁ గోర్గొనఁజాచులఁ గళికలనించున్॥

పదముల రతనపుటందెలు మొఱయఁగ భావజకేళులఁ బూరించున్
పొదలురవళిమణిమేఖల జాఱఁగఁ బూనికబరిఁగయిజుంబించున్॥

ఆనందమ్మున నమరియుండఁగా నరమోడ్పుఁగనుంగవ నొప్పున్
తా నవశం బయి తనులత తూలఁగ సూనశరున కిఁక మెప్పున్॥

రచియించెను జయదేవుఁడు రాధారమణీమణికథితమ్మున్
వఱిచురానందదలీలల శ్రీహరి రతిసుఖమును గ్రథితమ్మున్॥

శ్లో॥ హాస్త్రస్రస్తవిలాసవంశ మనృజుభ్రూవల్లి మద్వల్లవీ
బృందోత్సారిదృగంతవీక్షిత మతిస్వేదార్ద్రగండస్థలమ్,
మా ముద్వీక్ష్య విలజ్జితం స్మితసుధాముగ్ధాననం కాననే
గోవిందం వ్రజసుందరీగణవృతంపశ్యామి హృష్యామిచ॥

శ్లో॥ దురాలోకస్తోక స్తబకనవకాశోకలతికా
వికాసః కాసారోపవనపవ నోఽపి వ్యథయతి,
అపి భ్రామ్యద్భృంగీరణితరమణీయా న ముకుళ
ప్రసూతి శ్చూతానాం, సఖి!, శిఖరిణీయం సుఖయతి॥

సీ॥ రత్నాంగుళీయకరమణీయకరపద్మ
మునునుండి మోహనమురళి జాఱె,
నిగనిగ జిగిడాలు నిలువనీడలు గూర్చు
చెక్కుటద్దమ్ములఁ జెమరు వొడమెఁ
గనుబొమ లొయ్యారమునఁ ద్రిప్పి పొందు పొం
దని వ్రేతలకును సన్నలఁ బొనర్చె,
దంతకుట్మలముల దాచిన డాగక
చిఱునవ్వు వెన్నెల ల్చెంగలించె,
నన్నుఁ గనునంత బృందావనమ్ముపొంత
లజ్జఁ జెందుచు గోపవిలాసవతుల
నిలుచుఁగందోయి యెదుటను గలుగఁబోయి
యొనయఁ జేరఁడు చెలి! తల యెత్తఁ జింత ॥61

తను మూయించు నలంతిగుత్తుల నశోకంబుల్ ప్రఫుల్లాస్యముల్
పొనరంజేయ నలంతినై కొలఁకులన్ బూఁదోటల న్జొచ్చి వీ
చిన యీవయ్యార వేఁచుచున్నది యొకేఁ జేరంగ జుమ్మంచు మూ
గనళుల్ నిట్టుల మైనమావి మొగడ ల్కారించుచుండన్ జెలీ! 17

శ్లో॥ సాకూతస్మిత మాకులాకులగళ

ద్ధమ్మిల్ల ముల్లాసిత

భ్రూవల్లీక మలీకదర్శితభుజా

మూలార్ధదృష్ట స్తనం

గోపీనాం నిభృతం నిరీక్ష్య గమితా

కాంక్ష శ్చిరం చిన్తయ

న్నంతర్ముగ్ధమనోహరం హరతు నః

క్లేశం నవః కేశవః॥

సీ॥ ఆంతరంగికభావ మల్లన వివరించు
చిఱువెన్నెలలు గాయు చిర్నగవుల
జలజలఁ దావిపూవులు రాలఁగునిసి నో
కప్పులింపడి వీడిన క్రొమ్ముడులను,
కనుబొమ ల్సారించి గొనబుగా నొండొంట
హత్తి పైకెత్తినహస్తములను,
కలికివాల్చూపులఁ గమిచి పగ్గములట్లు
లటు నిటు సూపునొయ్యారములను

గోపికల హృద్గతంబుల గుర్తెఱింగి
యేమిరొ తలంచుచున్నట్టు లెసఁగి చూచు
వారికిం గ్రొత్త సూపుచు వఱలువాఁడు
క్లేశము లడంచుగావుత! కేశవుండు!!

## తృ తీ య స ర్గః

## ము గ్ధ మ ధు సూ ద న ము

శ్లో॥ కంసారి రపి సంసార
వాసనాబంధశృంఖలామ్,
రాధామాధాయ హృదయే
తత్యాజ వ్రజసుందరీః॥

శ్లో॥ ఇత స్తత స్తా మనుసృత్య రాధికా
మనంగ బాణవ్రణఖిన్న మానసః
కృతానుతాప స్స కళిందనందినీ
తటాంతకుంజే విషసాద మాధవః॥

## ము గ్ధ మ ధు సూ ద న ము

గీ॥ వాసనాశూన్యుఁ డయ్యును వాసుదేవుఁ
డలముసంసారవాసనయందుఁ గట్టు
వడినరాధిక నెమ్మది పదిలపఱచి
పట్టుదల గోపకాంతలపట్టు వదలె॥ 19

మ॥ తనియన్ బాళిని జుట్టి వేఁడుప్రియుఁ జిం
తన్ద్రోయుఁగా నాయమా ?
చనువా ? యంచును గుంది శౌరి మదిఁ బ
శ్చాత్తాపముం జెంది జా
డను గన్పట్టి కళిందనందినితటిన్
డాల్తీవెయింటన్ బొరిం
గని యిందందును నెందుఁ గానక మనం
గంటాతెఁ జింతాంబుధిన్। 20

ముగ్ధమధుసూదన హంసక్రీడనము

## ఘూర్జరీ(భూపాళ)రాగః — యతి(ఆది)తాళః

ప॥ హరి! హరి! హతాదరతయా॥ అ॥ సా గతా కుపితేవ॥

మామియం చలితా విలోక్య వృతం వధూనిచయేన,
సాపరాధతయా మయాఽపి న వారితాఽతిభయేన॥ 1

కిం కరిష్యతి? కిం వదిష్యతి? సా చిరం విరహేణ,
కిం ధనేన? జనేన కిం? మమ జీవితేన గృహేణ?॥ 2

చింతయామి తదాననం కుటిలభ్రుకోపభరేణ
శోణపద్మ మివోపరిభ్రమ తాఽఽకులం భ్రమరేణ॥ 3

తా మహం హృది సంగతా మనిశం భృశం రమయామి
కిం వనేఽనుసరామి తా? మిహ కింవృథా విలపామి?॥ 4

తన్వి! ఖిన్న మసూయయా హృదయం త వాకలయామి
తన్న వేద్మి కుతో గ తాఽసి? న తేన తేఽనునయామి॥ 5

దృశ్యసే పురతో గతాగత మేవ మే విదధాసి
కిం పురేవ ససంభ్రమం పరిరంభణం న దదాసి?॥ 6

క్షమ్యతా మపరం కదాపి త వేదృశం న కరోమి
దేహి సుందరి దర్శనం మమ మన్మథేన దునోమి॥ 7

వర్ణితం జయదేవకేన హరే రిదం ప్రవణేన
బిందుబిల్వసముద్రసంభవరోహిణీరమణేన॥ 8

## ముగ్ధమధుసూదన హంసక్రీడనము

### భూపాలరాగము - ఆదితాళము

ప॥ హరి! హరి! హతాధర మగుటఁ దా నరిగె నెటో కిన్కన్॥

చుట్టి వ్రేతల నున్న నన్గని యట్టె చనెఁ బ్రియ యొంటిగా
రట్టు సేయుట నేభయమున మఱల్పఁజాలక యుంటిగా॥ 1

ఏమిచేయును చిరవిరహమున? నేమి పలికెడు నాబిడ?
ఏమియుపకృతిజనము నా కీయిల్లు ధనమును మనుగడ?॥ 2

అలుకచే భ్రూమముడివడిన నీయాననంబుఁ దలంచెద
అళి తల ద్దిరుగాడ నగుశోణాబ్జముగ భావించెద॥ 3

నే నెపుడు నాయెదను జేరినదాని విడక సుఖించెద
కానఁ దిరుగఁగఁజాల రిత్తగఁ గ్రమ్మవగఁ జాలించెద॥ 4

తలఁతు, నోతన్వంగి! యీసునఁ నలఁగెనని నీతలఁపును
తలఁచి దాని నెఱుఁగితో నేఁ దెలియఁ, గాను కై ముదుపున్॥ 5

తోఁచుచుంటివి తిరుగుచుంటివి తొయ్యలీ! నా యెదుటను
ఏల చేటికిఁ? దొంటిగతి నెలయింపు బిగి కవుఁగింటను॥ 6

ఇంక నెన్నఁడు సేయనిటు క్షమియింపు సుందరి! తప్పును
శంక వీడుము! చూపు ముఖమును చంద్రమండలనిభమును॥ 7

బిందుబిల్వాన్వయపయోనిధివిధుఁడు హరిపదభక్తుఁడు
పొందుగా జయదేవకవిరవి పొగడె హరిని మహాత్ముఁడు॥ 8

శ్లో॥ హృది బిసలతాహారో నాయం భుజంగమనాయకః
కువలయదళశ్రేణీ కంఠే న సా గరళద్యుతిః
మలయజరజో నేదం భస్మ, ప్రియారహితే మయి
ప్రహరసి హరభ్రాంత్యాఽనంగ!, క్రుధాకిము ధావసి॥

శ్లో॥ పాణౌమాకురుచూతసాయకమముంమాచాపమారోపయ
క్రీడానిర్జితవిశ్వ!, మూర్ఛితజనాఘాతేన కిం పౌరుషం?,
తస్యా ఏవ మృగీదృశో మనసిజప్రేంఖత్కటాక్షాశుగ
శ్రేణీజర్జరితం మనాగపి మనో నాద్యాపి సంధుక్షతే॥

శ్లో॥ భ్రూపల్లవం ధను, రపాఙ్గతరఙ్గితాని
బాణా, గుణశ్రవణపాళి రితి స్మరేణ
తస్యా మనఙ్గజయజఙ్గమదేవతాయా
మస్త్రాణి నిర్జితజగంతి కి మర్పితాని॥

సీ॥ హృదయమ్మున న్దోఁచునది సర్ప మనుకొందొ?
కాదు కా దిది తూఁటికాడగాని,
కంఠాంతరమ్మునఁ గన్పించునది గర
లం బౌకొ? కా దుత్పలదళపంక్తి,
మై యలందినది భస్మం బౌనొ? కా దది
కమ్మని మంచిగందమ్ము రజము
నన్ను ముక్కంటిగా నెన్నుచుంటివొ? కాను,
లీలావిలోలగోపాలకుఁడను
భ్రాంతిపడి రిత్త యేటికి పయికి దుమికె
దోయనంగుఁడ!, యీ పేరు నుండ దింక,
బాణసంధానమును మాని భయము భక్తి
గలిగి జాగ్రత్తతోఁ దటిఁ గడపికొనుము!॥

శా॥ కేలం బూనకు మావిలేజివురుముల్కి న్వింట సంధింప కో
లీలానిర్జితవిశ్వ! యో మదన! మేలే పిండి దంపంగ? నా
లోలాలోక లగించుచూడ్కు లొగి నాలోఁ జొచ్చుటన్వ్రీలిక
ల్లోలంబై మది యించు కేనియును నిల్పం గాంచ దీ వేళకున్

చ॥ విరిసినతీర్పుకన్ను బొమవిల్లు, కటాక్షములమ్ము, లాశ్రవాం
తరములు నల్లెత్రాఁడనుచుదర్పకుఁ డాత్మను నిశ్చయించి తా
దిగుగు ననంగ దేవజయ దేవత యే ప్రియరాధయందునం
గరళిజగ త్త్రియంబెగిచి గెల్చినయస్త్రములుంచెనే మొకో?

శ్లో॥ భ్రూచాపే నిహితః కటాక్షవిశిఖో
నిర్మాతు మర్మవ్యథాం
శ్యామాత్మా కుటిలః కరోతు కబరీ
భారోపి మారోద్యమమ్,
మోహా స్తావ దయం చ, తన్వి! తనుతాం
బింబాధరో రాగవాన్
సద్వృత్త స్తనమణ్డల స్తవ కథం
ప్రాణై ర్మమ క్రీడతి!॥

శ్లో॥ తాని స్పర్శసుఖాని, తెచసరళాఃస్నిగ్ధాదృశో విభ్రమాః
తద్వక్త్రాంబుజసౌరభం, సచసుధాస్యందీగిరాంవక్రిమా,
సా బింబాధరిమాధు రీతి విషయాసంగేపి చేన్మానసం
తస్యాంలగ్నసమాధి, హంత! విరహవ్యాధిఃకథంవర్ధతే!॥

శ్లో॥ తిర్యక్కంఠవిలోలమౌళి తరళో త్తంసస్య వంశోచ్చల
ద్గీతిస్థానకృతావధానలలనాలక్షై ర్న సంలక్షితాః
సంముగ్ధేమధుసూదనస్యమధురేరాధాముఖేందౌసుధా
సారేకందళితాశ్చిరందదతునఃక్షేమంకటాక్షోర్మయః॥

సీ॥ వెచ్చఁగాఁ గనుచోనువి ల్వీడి క్రీచూపు
శరమైయెచదిమినంజదుమవచ్చు
నల్లనై వంకరై నడసాగు కబరికా
భరమేర్చఁదిరిగినం దిరుగవచ్చు
రాగమ్ము కలుగుట రంజిల్లి బింబాధ
రమ్ము మోహము తెమ్ము తెమ్మవచ్చు
వెలిదామరలసిరి వెడఁగుగాఁ నొత్రమెదం
బోరిఁ దెల్లఁబుచ్చినన్ బుచ్చవచ్చు
పొదిరి పూబంతికంటెను మృదువు గలిగి
నగముకంటెను గొప్పఁదనంబు గలిగి
మంచివృత్తంబు గలిగి సమత్వ మొప్పు
నీయురోజమ్ము ప్రాణము ద్రాయుటగునె! ॥24

ఆమైతాపలహాయి, చంచలము నత్యంతానురక్తమ్ము నా
యామినాక్షివిలాసలాస్యముఁదదాస్యామోదసమ్మోదమున్
శ్రీమద్వక్త్రవచఃప్రచాగ, మధరాచ్చిస్నామృతం, బొప్పుచో
నేమో! యీవిరహాజ్వరం బుడుగదయ్యో౦ బెంపు దీపించెడిన్ ॥25

తారస్థాయి నెసంగు వేణురసవద్గానంబున స్సర్వధీ
ప్రారంభంబులు నిల్పుటన్ వ్రజసతీవారంబు లున్న స్సుధా
సారశ్రీకర రాధికాముఖమునన్ జాల్కొల్పు శ్రీకృష్ణు సు
స్మేరాపాంగతరంగనృత్యములు రక్షించున్ జగజ్జాలముల్ ॥ 26

## చ తు ర్థ స ర్గ ము

## స్ని గ్ధ మ ధు సూ ద న ము

శ్లో॥ యమునా తీరవానీర
నికుంజే మంద మాస్థితమ్,
ప్రాహ ప్రేమభరోద్భ్రాంతం
మాధవం రాధికాసఖీ॥

## అష్టపది – 8

### స్నిగ్ధ మధుసూదనము

గీ॥ యమునచెంగటఁ బ్రబ్బలి యలరుఁదీవ

యింట వెడఁ గట్టు లోకరీతి నెసఁగుచున్న

కృష్ణుఁ గని రాధచెలికత్తె యిట్టు లనియె,

నున్న దున్నట్లు మధురమయోక్తి నెఱఁగి।

హరివల్లభాశోక పల్లవము

కర్ణాట (సౌరాష్ట్రి, కానడ) రాగః - ఆది (...)

ప|| సా విరహే తవ దీనా|| అ|| మాధవ! మనసిజవిశిఖ
దివ భావనయా తవ

నిందతి చందన మిందుకిరణ మను విందతి ఖేద మధీరమ్
వ్యాళనిలయమిళనేన గరళ మివ కలయతి మలయసమీరమ్

అవిరళనిపతితమదనశరా దివ భవదవనాయ విశాలమ్
స్వహృదయమర్మణి వర్మ కరోతి సజలనళినీదళజాలమ్ ||

కుసుమవిశిఖశరతల్ప మనల్పవిలాసకలాకమనీయం
వ్రత మివ తవపరిరంభసుఖాయ కరోతి కుసుమశయనీయం

వహతి చ వలితవిలోచనజలధర మాననకమల ముదారం
విధు మివ వికటవిధుంతుదదంతదళనగలి తామృతధారమ్

విలిఖతి రహసి కురంగమదేన భవంత మసమశరభూతం
ప్రణమతి మకర మధో వినిధాయ కరే చ శరం నవచూతం

ధ్యానలయేన పురః పరికల్ప్య భవంత మతీవ దురాపం
విలపతి హసతి విషీదతి రోదితి చంచతి ముంచతి తాపమ్||

ప్రతిపద మిద మపి నిగదతి, మాధవ!, తవచరణేపతి తాహం
త్వయివిముఖే మయి సపది సుధానిధి రపి తనుతే తనుదాహం

శ్రీజయదేవభణిత మిద మధికం యది మనసా నటనీయం
హరివిరహాకులవల్లవయువతిసఖీవచనం పఠనీయమ్

హరివల్లభాశోక పల్లవము

కన్నడ రాగము - ఆదితాళము

ప॥ ఎడయుటఁ దాఁ గడునడలు॥

అ॥ఒడయ! మరునిముల్కులకుల్కి నయటు లెడదహత్తునీయొడలు

దూఱు మంచిగందంబును నగమై దూలి పండువెన్నెలలన్
సారెఁదలఁచుఁబాములకలయికనువిసమ్ముగఁజిఱుపయ్యెరలన్॥

తఱుచుగఁ బైఁబడు పలుమరునమ్ముల తాకువ నినుఁ గాపాడన్
పఱచు నెదఁ గవచమ్ముగ లేఁదామరపాకుజలము దోఁగాడున్

వెలయు వివిధశిల్పకలారీతుల వెడదపూల తలిమంబు
మలిచె దీక్ష శరతల్పంబుగ విస్మయముగఁ గొని నియమంబు

రాహువుకోఱలగంటులఁదోడివడిరసముతోఱఁగుచంద్రునిపగిది
మోహానముఖమునఁగన్నీరొలుకఁగఁబోడఁగాంచునునినుసారిది

ఏకతమునఁ గస్తూరిచే నిను రచియించును బూవిలుతునిగన్
జోఁకనుగ్రిందుగ మొసలినిగైనవచూతంబిడియెఱఁగునుపనిగన్॥

యోగియుధ్యానయోగంబునదుర్లభుఁజూచుచునినుఁదనమ్రోలన్
వగచునవ్వుఁబొగలును దుఃఖించును నగుమొగిఁదాపమువ్రీలన్

పెడమొగ మిడనీ వాఁడయ్యెఁడ నేఁయును నొడలిని జిచ్చులు
గురియున్

పడితిని నడుగుల డాసురాల నడుగడుగున వను గుఱి విరియన్

కవి జయదేవుని పలు కమృత మ్మని జ్ఞానులు మీఱెదఁదలఁపన్

చవిఁగొనుఁడీ! హరివిరహాకులవ్రజసతి చెలినుడి సిరి గొలుపన్

శ్లో॥ ఆవాసో విపినాయతే, ప్రియసఖీ
మాలాపి జాలాయతే,
తాపో నిశ్వసితేన దావదహన
జ్వాలాకరాళాయతే,
సాఽపి త్వద్విరహేణ, హంత! హరిణీ
రూపాయతే హా! కథం!
కందర్పోఽపి యమాయతే విరచయన్
శార్దూలవిక్రీడితమ్॥

◆ శా॥ ఏడంతస్థులమేడ కాసగుములై
యుర్వ్యాకంలన్ దోఁచుఁ బూఁ
జోఁడుల్ పెన్వాలలట్లు చిక్కుపఱుపన్
ముక్కూర్పు కార్చిచ్చు త్రో
ద్రోడం జూడెను గాముఁ డస్యముఁడు శా
ర్దూలంబటుల్ గాండ్రీలెన్
లేడిం బోలినరాధ నీ వెడయు నేఁ
లీలన్ మనున్ శ్రీహరీ॥

---

◆ పా:- శా॥ ఈడే లేనినగర్లు కాఅడవులయ్యె, నెల్లెఁ బాటించుప్రాఁ
బోఁడు ల్పేరుటిచేరులయిట్లది, యూర్పులూషఁ గార్చిచ్చుగా
నాడె న్గాంత వియోగదుఃఖహుతిపాలై యొంటిహూహాంద నా
జాడ న్బొంచి మరుం డదేయడనుగా శార్దూలములాః నెట్లోకో॥

శ్రీ సాంధ్ర గీతగోవిందకావ్యము

# అష్టపది - 9

స్నిగ్ధమధుసూదన రాసావళియను

## దేశాక్షరిరాగః - ఏకతాళః

ప॥ రాధికాకృష్ణ! రాధికా

అ॥ రాధికా! తవవిరహే కేశవ!

స్తనవినిహిత మపి హార ముదారం
సా మనుతే కృశతను రివ భారమ్ 1

సరసమసృణ మపి మలయజపంకం
పశ్యతి విష మివ వపుషి సశంకమ్ 2

శ్వసితపవన మనుపమపరిణాహం
మదనదహన మివ వహతి సదాహమ్॥ 3

దిశి దిశి కిరతి సజలకణజాలం
నయననళిన మివ విగళితనాళమ్॥ 4

నయనవిషయ మపి కిసలయతల్పం
కిలయతి విహితహుతాశనకల్పమ్॥ 5

త్యజతి న పాణితలేన కపోలం
బాలశశిన మివ సాయ ములోలమ్॥ 6

హరి రితి హరి రితి జపతి సకామం
విరహవిహితమరణేన నికామమ్॥ 7

శ్రీజయదేవభణిత మితి గీతం
సుఖయతు కేశవపద ముపనీతమ్॥ 8

స్నిగ్ధమధుసూదన రాసావలయము

## దేశాక్షరిరాగము - ఆదితాళము

ప॥ రాధికవారి, కృష్ణరాధిక॥

అ॥ రాధిక నీదు విరహమునఁ గేశవ!।

అలిత నిడిన వెల కంచనిహారము
బరువుగఁ దలఁచుఁ దా నెరియు శరీరము॥ 1

చికిలాని చల్లని సిరి మై గలపము
ఉక్కటి విసమని యొఱఁగును దలఁపము 2

ఊస్సు రనుచు నిట్టూర్పులు వుచ్చును
దుస్సహ మను మరుతూపుల చిచ్చుపు 3

కన్నను గమలము కాడఁ జూపినటు
కన్నీ రొలుకఁగఁ గను దా నిటునటు. 4

దగ్గఱఁ గనఁబడు తలిరులపాన్పును
భగ్గను మనియెడు పావకుఁ డనుకొను॥ 5

సంజను గదలని శశి యగు చెక్కిలి
మూజే వదలదు మొనసిన తెక్కలి॥ 6

హరి హరి హరి హరి యనుచు జపించును
మరణము తోఁచిన కరణిఁ గన్పించును। 7

జయదేవుఁడు హరి చరణంబుల నిడు
నయమయు తాష్టపది నవరససుఖ మిడు॥ 8

శ్లో॥ సా రోమాంచతి సీత్కరోతి విలప
త్యుత్కంపతే తామ్యతి

ధ్యాయ త్యుద్భ్రమతి ప్రమీలతి, పత
త్యుద్యాతి మూర్ఛ త్యపి

ఏతావ త్యతనుజ్వరే వరతను
ర్జీవే న్న కిం తే రసాత్

స్వర్వైద్యప్రతిమ ! ప్రసీదసి యది
త్యక్తోఽన్యథా హ స్తకః॥

శ్లో॥ స్మరాతురాం దైవతవైద్యహృద్య!
త్వదంగసంగామృతమాత్రసాధ్యామ్

విముక్తబాధాం కురుషే న రాధాం
ఉపేంద్ర! వజ్రాధిక దారుణోఽసి॥

సీ॥ పెలుచ గద్గదపాటు గలుగుట నీ త్రృతుల్
　　తలచు తెలిపిలేక పలవరించుండు,
వెడ వెడనుడి పరిలాపించుచుండు సతమ్ము,
　　గడగడ నెడయక వడకుచుండు,
తేలిపోవుటఁ గడు సోలుచుండు, నెడందఁ
　　బ్రార్థన మొనరించు బైకిలేచు,
కన్నులు మూయఁ దెక్కలి కనపడుచుండు,
　　మూర్ఛాసముచ్ఛ్వాయముల్ భజించు
గాఢమతను జ్వరంబునఁ గ్రాఁగి రాధ
　　పదియవస్థలుఁ గ్రమముగాఁ బ్రకటములుగ!
నాశ్వినేయుఁడ వగుచుఁ బ్రత్యక్ష మందు
　　నీవు రాకున్న యముఁడవు కావె! కృష్ణ!॥ 29

ఉపేంద్రవజ్ర॥ కృప స్మనోజార్దితరాధ పెరక
　　వపుస్సుధ స్నాపముఁ దీర్పకున్నక
కృపాణధారాకృతి, దస్రసహృద్య!
　　ఉపేంద్ర! వజ్రాయుత మాదుచుమ్ము!॥

శ్లో॥ కందర్పజ్వరసంజ్వరాతులతనో రాశ్చర్య మస్యాశ్చిరం
చేతశ్చందనచంద్రమఃకమలినీ చింతాసు సంతామ్యతి
కింతు క్లాంతివశేవ శీతలతరం త్వా మేక మేవ ప్రియం
ధ్యాయంతీ రహసి స్థితా కథమపి క్షీణా క్షణం ప్రాణితి॥

శ్లో॥ క్షణ మపి విరహః పురా న సేహే
నయననిమీలనఖిన్నయా యయా తే
శ్వసితి కథ మసౌ రసాలశాఖం
చిరవిరహేణ విలోక్య పుష్పితాగ్రామ్॥

శ్లో॥ వృష్టివ్యాకులగోకులావనరసా దుద్ధృత్య గోవర్ధనం
బిభ్రద్వల్లవవల్లభాభిరధికానందా చ్చిరం చుంబితః,
దర్పేణైవ తదర్పితాధరతటీసిందూరముద్రాంకితో
బాహుర్గోపతనో స్తనోతు భవతాం శ్రేయాంసి కంసద్విషః

గండముఁ జంద్రు నట్లు బిసకాండము నెంచినమారుతాపమున్
జెందినరాధ మార్గ్గముచే వెడలించును సీత్కృతంబులో
సుందర! చిక్కి సోలియును జొక్కన మిక్కిలిచల్లనైనవా
నిందలపోయు నిన్నె కడుఁనిష్ఠను నైమై వెలయింప నొంటినైమై॥ 31

పుష్పితాగ్ర॥ త్రుటి యెడయఁగఁ గుందుహా!
ఘటికలఁ గన్నుల కోర్కులన్ మెలంగున్
ఎటు తడ వగుచో నెసంగుఁ దా ని
చ్చోటునన్ రసాలను జూచి పుష్పితాగ్రన్॥ 32

గోడుగ్గై ఊజడి గోకులంబు మనుపన్ గోవర్ధనం బెత్తి యె
స్కుడుమోదమ్మున మూఁగి గోపికలు కోర్కుల్మీఱముద్దాడియె
ల్లెడ సిందూరపుఁగాంతి రాగరస మిల్లే యంచు బోధింపనా
వెడఁకఁసుంబారిగొన్న కౌరిభుజముర్విన్ శ్రేయములూఁర్చుతన్

# పంచమసర్గము

## సాకాంక్షపుండరీకాక్షము

## అష్టపది — 10

శ్లో॥ అహ మిహ నివసామి,

యాహి రాధాం

అనునయ మద్వచనేన

చానయేథాః

ఇతి మధురిపుణా

సఖీ నియుక్తా

స్వయ మిద మేత్య పున

ర్జగాద రాధామ్॥

గీ॥ చనుము వేవేగ నేసుగాం

జనవు మెఱసి

యనునయింపుము! నే వచ్చు

దనుక నింట

నిలుత నని పల్కి హరి, మది

నలరి తిరిగి

యేగి చెలికత్తె రాధతో

నిట్టు లనియె

## అ ష్ట ప ది – 10

హరిసముదయ గరుడపదము

పంతువరాళి (దేశాక్షరీ) రాగః – రూపకతాళః

ప తవవిరహే వనమాలీ॥ అ॥ సఖి! సీదతి రాధే!

వహతి మలయసమీరే మదన ముపనిధాయ
స్ఫుటతి కుసుమనికరే విరహిహృదయదళనాయ॥ 1

దహతి శిశిరమయూఖే మరణ మనుకరోతి
పతతి మదనవిశిఖే విలపతి వికలతరో౽తి॥ 2

ధ్వనతి మధుపసమూహే శ్రవణ మపి దధాతి
మనసి కలితవిరహే నిశి నిశి రుజ ముపయాతి॥ 3

వసతి విపినవితానే త్యజతి లలితధామ
లుఠతి ధరణిశయనే బహువిలపతి తవనామ॥ 4

రణతి పికసమవాయే ప్రతిదిశ మనుయాతి
హసతి మనుజనిచయే విరహ మపలపతి నేతి॥ 5

స్ఫురతి కలరవరావే స్మరతి మణిత మేవ
తవరతిసుఖవిభవే గణయతి సుగుణ మతీవ॥ 6

త్వదభిధశుభదమాసం వదతిసతి శృణోతి
తమపి జపతి సరసం యువతిషు న రతి ముపైతి॥ 7

భణతి కవిజయదేవే విరహవిలసితేన
మనసి రభసవిభవే హరి రుదయతు సుకృతేన॥ 8

హరిసముదయ గరుడపదము

పంతువరాళిరాగము - రూపకతాళము

ప॥ వందురు రాధా! చెలి!॥ అ॥ పోం దెసయుట వనమాలి।

మలయమారుతమ్ము వీవ మదనుఁ డలరి డాయు
నలిఁ బధికులగుండె లవియ ననలు తనులు పూయు। 1

శిశిరకిరణుఁ డయ్యొ విధుఁడు చిచ్చు గురియ మడియఁగా
దశదిశలను వెడల మదుని విశిఖములను సుడియఁగా। 2

అవలింపఁగఁ దేంట్లు మూఁగి తవిలి చెవులు మూయు
రవలుకొన విరహము మదిని రాత్రులందుఁ దెవులెనయు॥ 3

లలితమందిరములఁ బాసి పలుమఱు నినుఁ బిలుచుచు
నిలక తిరుగుఁ గారడవుల నేలఁ దూలి పొరలుచు॥ 4

కువో! కువో! యని కోయిలలుం గూయు దెసలకు నులుకు
ఎవరేని నిదేమని నగ నిల్లె యనుచుఁ బలుకొలుకు। 5

పావురాలు మ్రోయు మణితభావ మాత్మ నించు
సావధానమతి నవిరతి సంగతి సుఖ మెంచు॥ 6

నీదుపేరి నెలను బాడ నిలిచి చెలి నిగుడ్చు
ఊఁది దానినే జపించు నువిదల నిరసించు॥ 7

జయదేవకవీశ్వరకృత సరసవిరహగీతి
నయవినయాభినయము మయుఁ గ్రన్నఁగఁ జేయు సుఘణితి॥ 8

శ్లో॥ పూర్వం యత్ర సమం త్వయా రతిపతే
రాసాదితా స్సిద్ధయః
తస్మి న్నేవ నికుంజమన్మథమహా
తీర్థే పున ర్మాధవః
ధ్యాయం స్త్వా మనిశం జప న్నపి తవై
వాలాపమంత్రావలీం
భూయ స్త్వత్కుచకుంభనిర్భరపరీ
రంభామృతం వాంఛతి॥

♦ శా॥ ము న్నెచ్చో నినుఁ గూడి మన్మథుతపం
బు న్బండఁగాఁ జేసెనో
వెన్నుం డాతని పుణ్యతీర్థ మయి తృ
ప్తిం గూర్చు నాజ్ఞాంపమం
• దు న్నీరూ, పెద నీదుపల్కు జపమం
దుం జేర్చి నిష్ఠన్ సదా
యున్నాఁ డోసఖి! నీహృదైక్య మమృతం
బుప్పొంగి కాంక్షించుచున్॥ 35

---

♦ పా:-మ॥ ముచు నీతో సరికేళి నెందుఁగనినా న్భావిల్లుసర్వార్థసి
ద్ది నదేమేల్ప్వవరింటి మన్మథమహాతీర్థంబున స్నానమ్మటి
స్నిను ధ్యానించుసతంబు మంత్రమునుగా నీపల్కులే తా జపిం
చును నీగుత్తపుగౌఁగిలింతసుధ గృష్ణుఁ డెంతో కోరు న్సఖీ!

## అష్టపది – 11

సాకాంక్షపుండరీకాక్షోత్కంఠామధురము

ఘూర్జరీ(పాడి)రాగః – ఏకతాళః

ప॥ ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ॥

అ॥ గోపీపీనపయోధరమర్దనచంచలకరయుగశాలీ॥

రతిసుఖసారే గత మభిసారే మదనమనోహరవేశం
నకురు నితంబిని గమనవిళంబన మనుసర తం హృదయేశమ్॥ 1
నామసమేతం కృతసంకేతం వాదయతే మృదువేణుం
బహుమనుతే తనుతే తనుసంగతపవనచలిత మపి రేణుమ్॥ 2
పతతి పతత్రే విచలతి పత్రే శంకితభవదుపయానం
రచయతి శయనం సచకితనయనం పశ్యతి తవపంథానమ్॥ 3
ముఖర మధీరం త్యజ మంజీరం రిపు మివ కేళిషు లోలం
చల సఖి కుంజం సతిమిరపుంజం శీలయ నీలనిచోళమ్॥ 4
ఉరసి మురారే రుపహితహారే ఘన ఇవ తరళబలాకే
తటి దివ పీతే రతివిపరీతే రాజసి సుకృతవిపాకే। 5
విగళితవసనం పరిహృతరసనం ఘటయ జఘన మపిధానం
కిసలయశయనే పంకజనయనే నిధి మివ హర్షనిదానమ్। 6
హరి రభిమానీ రజని రిదానీ మియ మపి యాతి విరామం
కురు మమవచనం సత్వరరచనం పూరయ మధురిపుకామమ్॥ 7
శ్రీజయదేవే కృతహరిసేవే భణతి పరమరమణీయం
ప్రముదితహృదయంహరిమతిసదయంనమతసుకృతకమనీయమ్॥ 8

సా కాంతుఫుండరీకాక్షోత్కంఠామధురము

ఘూర్జరిరాగము - ఏకతాళము

ప॥ పయ్యెర వీచెడు యమునాతటవని వసియించునువనమాలి
అ॥ ఒయ్యారుల యురువక్షోజమ్ములనొఱయుచుఁ గ్రేల్గవఁ గ్రాలి॥
హాయి గూర్చు సంకేతపదమ్మున కరుగు నితంబిని వేఁగ
చేయకు మాలస్యము రమణుఁడు రమణీయుఁడు చేరను సైఁగ
మురియుచు మురళిని మొఱయించుచుఁ జాతురి నిను మొగిఁ
బలికించున్
విరివిగ నీమై సోకినపయ్యెర వెడలు రేణువును భావించున్॥ 2
ఈఁక రాలినను నాకు కదలినను నీవరుదెంచితి వనుచున్
పోకలు వింతగఁ దలిరుల సెజ్జను బొనరుచు నీదెసఁ గనుచున్॥
కదలుచు వదలక మ్రోగెడు నందియ వదలుము పగతుని పగిది
పొదలు చిమ్మచీఁకటి పొదరింటికి కదలుము నల్లని మడు గూది॥
చదలున మొయిలునఁ గదలుబెగ్గురులకదుపటుహారములొప్పన్
సదయుని యెద మెఱ యిడుపురుషాయితచర్య సుకృతము
ఫలియింపన్॥ 5
వలువ చెలిమి మెఱనూలుజలిమియిరువంకలఁదొట్రిలిడాఁగన్
జఱరహాక్షి! తలిమము జేర్పుము గనివలెజఘనముమదిలోఁగన్॥
హరియభిమానధనుం డీరాత్రియ నరుగుచుఁ డెఁ దెలవాఱన్
త్వరగా నేఁ జెప్పినయటుఁ జేయుము రయి తీరనికోరికనెఱవేఱన్॥
శ్రీజయదేవుఁడు మధువయఘశీలిని జేసిన హరిపదసేవ
రాజిలఁగ తొలకమునలుపుఁడు మీరు నురఁజలు హరియిదిత్రోవ॥ 8

శ్లో॥ వికిరతి ముహుః శ్వాసా న్దిశాః పురో ముహు రీక్ష తే
ప్రవిశతి ముహుఃకుంజంగుంజన్ ముహుర్బహు తామ్యతి
రచయతి ముహు శ్శయ్యాం పర్యాకులం ముహు రీక్ష తే
మదనకదనక్లాంతః కాంతే! ప్రియ స్తవ వర్తతే॥

శ్లో॥ త్వద్వామ్యేనసమంసమగ్రమధునాతిగ్మాంశుర స్తంగతో
గోవిందస్య మనోరథేనచసమంప్రా ప్తంతమస్సాంద్రతాం
కోకానాం కరుణస్వరేణ సదృశీ దీర్ఘా మదభ్యర్థనా
త న్ముగ్ధే! విఫలం విలంబక మసౌరమ్యోభిసారక్షణః॥

శ్లో॥ సామాంద్రక్ష్యతివక్ష్యతిస్మరకథాఃప్రత్యంగమాలింగనైః
ప్రీతిం యాస్యతి రంస్యతేసఖి! సమాగత్యేతిచింతాకులః
స త్వాం పశ్యతి వేపతే పులకయ త్యానందతి స్విద్యతి
ప్రత్యుద్గచ్ఛతి మూర్ఛతి స్థిరతమఃపుంజే నికుంజే స్థితః॥

గీ॥ వదలు మాటికి నూర్పులు జెదరిచూచు
నలుదెసలు దూఱుఁ బొదరిండ్లు, కలఁకఁ గుందుఁ
బాన్పుఁ గల్పించు, నాకులపాటుఁ జెందుఁ
దాగవిలుతుబాఱి నీదు కాంతుండు రాధ!॥ 36

నీవక్రత్వము నూర్యుఁ డోర్క్రపఱేఁ దన్వీ! క్రుంకెఁ బూర్ణంబుగా
నీవేళం దఱచమ్యో శ్రీహరిమనోభీష్టంబుఁ జెంజీకటుల్
నావిజ్ఞప్తియుఁ జక్రవాకముల దీనాలాపముల్ సాగె ము
గ్ధా! వే యేగుము మంచి కాబ మిది వ్యర్థంబౌ విలంబించుచోన్॥

తెఱచుటిరు ల్గుబురొన్ను లతాగృహమందునఁ జేరి రాధ నం
న్నరయును ముచ్చటించుఁ గుసుమాస్త్రికథల్, కవుగింటఁ
జేర్చు స
బరపడు లోఁకమించు నని బాళి నినుం గనుఁ గంపమందు గ
గ్గురుపడు నుబ్బుఁ జెమ్మరిలుఁ గొంతచనుఁ హరిమూర్ఛిలున్సఖీ!॥

శ్లో॥ ఆశ్లేషాదనుచుంబనా దనునఖోల్లేఖా దనుస్వాంతజ
ప్రోద్బోధాదనుసంభ్రమాదనురతారంభాదనుప్రీతయోః
అన్యార్థంగతయోర్భ్రమాన్మిళితయోస్సంభాషణైర్జానతోః
దంపత్యో రిహ కో న కో తమసి వ్రీడావిమిశ్రో రసః॥

శ్లో॥ సభయచకితం విన్యస్యంతీం దృశౌ తిమిరే పథి
ప్రతితరు ముహు స్థిత్వా మందం పదాని వితన్వతీం
కథమపి రహః ప్రాప్తా మంగై రనంగతరంగిభిః
సుముఖి! సుభగః పశ్యన్ సత్వాముపైతు కృతార్థతామ్॥

సీ॥ బిగికౌఁగిలింతలఁ దగు భయానకమున
నను చుముద్దులఁ గరుణాస్ఫురణను
తతనఖక్షతములఁ దవులు వీరమ్మున
నలము భావమ్ముల యద్భుతమున
మన్మథోద్బోధిసంపదను హాస్యమ్మునఁ
గామభోగముల శృంగారసరణి
ప్రీతులై భ్రమవడి పెఱలకై చని డాసి
పలుకులఁ దమరూపు దెలిసి తనిసి
చిమ్మచీఁకటిపొదరిండ్ల చెంత మెలఁగు
దంపతుల సిగ్గుసొమ్మును దరలనీక
చూపుపోఁకలలోఁ దలచూపనట్టి
రసము లుండునె రాధికారమణి! యెంచు॥ 39

♦ గీ॥ బెదరిచూచుచు వెఱపున విరియు సిరుల
త్రోవ నిల్చుచుఁ దరువులఁ దొరసి యల్ల
నడుగు లిడు చట్టు లొంటిగా నవయవములు
బొదలఁ జనుదెంచునినుఁ గాంచి పొలుచు హరియు॥ 10

---

♦ పా:- చ॥ సొగసు మొగంబు దాన! వెఱచూడ్కులఁ జీఁకటిత్రోవ మెల్లమె
ల్లఁగ నడుగాడగాఁ దరువుల న్బొరిఁ దాఱుచు నక్కు చెట్టులోఁ
తెగఁబడు మారుపొంగులకుతి న్నణుఁగుద్దరిఁ జేఁబాఱి నీ
వగుపడి యందగానికిఁ గృతార్థతఁ గూర్తువు గాఁత మెందుగన్॥

